

# శ్రీచక్ర లఘు పూజా విధానము



యేనుగుమహల్‌లోని శ్రీచక్రమేరువుతో గ్రంథకర్త

# దేవ్యపరాధ స్తోత్రరత్నమ్ - భావదీపిక

1. మాతా ! నీ మంత్రమును గాని, యంత్రమునుగాని, స్తుతిని గాని ఆహ్వానమును గాని, ధ్యానమునుగాని, స్తుతి కథలను గాని, ముద్రలను గాని, విలపించుటను గాని ఎరుగను; కష్టములను హరించు నిన్ను అనుసరించుట నేను ఎరుగుదును.

2. విధి తెలియక, ద్రవ్యములేక, అలసత చేత కర్తవ్యము నెర వేర్పలేక నీపాద సన్నిధి నుండి పతనము కల్గినది. అంద రను ఉద్ధరించు ఓ తల్లీ పార్వతి ! క్షమింపుము; కుపుత్రుడు కల్గినను ఎప్పుడును తల్లి కుమాత కాదుగదా !

3. జగన్మాతా ! తల్లీ ! నీ పాద సేవ చేయలేదు, నీకు అధిక ముగా ద్రవ్యము ఈయలేదు. అయినను నా యందు నిరుప మాన వాత్సల్యము కల్గియున్నావు. కుపుత్రుడెక్కడనైనను ఉండవచ్చును గాని, తల్లి ఎప్పుడును కుమాత ఉండదుగదా !

4. భూమి మీద నీకు అనేకమంది పుత్రులు కలరు. వారిలో నేను అతితక్కువ వాడను. నన్ను విడుచుట నీకు తగదు. కుపుత్రుడు అయినను తల్లి ఒకప్పుడును కుమాత కాదుగదా !

5. మాతా ! వివిధముగా పరసేవాసక్తిచే ఇతర దేవతలను పూజిం చితిని, నాకు ఎనుబది అయిదు దాటిన వయస్సున, ఇపుడు నీ దయ లేనిచో అవలంబములేనివాడనై, లంబోదరజననీ ! ఎవరిని శరణు పొందను ?

# ప్రకాశకుల విజ్ఞప్తి

గత పదనారు సంవత్సరములలోను శ్రీ ప్రణవానందస్వామి వారి ద్వారమునను, వారి మిత్రులు బ్రహ్మశ్రీ ఓం జీ నారాయణ మహారాజ్-కుమారీ రత్నంబెల ద్వారమునను, రెండువేలకు పైబడిన భక్తులకు వివిధ ప్రస్తారముల శ్రీ చక్రముల నందజేసిరి. వారి కోరిక పైనను, మరికొందరి భక్తుల కోరికపైనను ఈ "శ్రీచక్ర లఘుపూజా విధానము" యొక్క సంకలన కర్త శ్రీ స్వామి ప్రణవాందులవారు మాకందించిరి. శ్రీ ప్రణవానందులు 1960వ సంవత్సరమున ఇరువది ఐదేసి కిలోల బరువుగల రెండు పదిచవావులతో చేయబడిన శ్రీచక్ర మేరువులను కాంచాపురమున తయారు చేయించినది మొదలు శ్రీ చక్రమును గురించిన అన్వేషణ (Rescarch) 6 పుటలతో ప్రారంభించి 1976 వ సంవత్సరము నాటికి 220 పుటల పైపు గ్రంథము అయినది. (A Treatise on Sricakra ) దీనిని ఢిల్లీలోని నేషనల్ మ్యూజియము (Nationel Musium) వారు అచ్చు వేయించుటకు పూనుకొన్నారు.

ప్రస్తుతపు 'శ్రీచక్ర లఘుపూజా విధానమున (1) శ్రీచక్ర మేరు ప్రతిష్ఠ సందర్భమున వెలువడిన శ్రీచక్రి లఘుసర్వస్వము (2) శ్రీ సౌభాగ్య అష్టోత్తర శతనామావళి (3) దశమహావిద్య లోని, షోడశ మహావిద్యనలోని శ్రీ లలితా సహస్ర నామస్తోత్ర నామావళి (4) శ్రీ లలితా త్రిశతీస్తోత్రరత్న నామావళి (5)

శ్రీచక్ర నవావరణకు కావలసిన సామాగ్రి (6) దేవీఖడ్గమాలా స్తోత్ర నామావళి (7) గీతపై శ్రీ చివుకుల నరసింహంగారి విమర్శ (8) గీతపై శ్రీ ప్రజ్ఞానందస్వాముల వారి ప్రస్తావనా (9) శ్రీ దోర్బలపు శోభనాద్రి శాస్త్రి గారి విజ్ఞప్తి 10) దేవ్య పరాధ స్తోత్రరత్నము (11) డాక్టర్ స్వామిజ్ఞానానందస్వామి వారి సంక్షిప్త జీవన చరిత్ర (12) శ్రీ చక్రము నందు పాకిన 40 తప్పులు. పాఠకుల సౌకర్యార్థమునకై అనుబంధములుగ పొందు పరుపబడినవి.

గ్రంథ కర్తకు జులై నెల 1978లో యేనుగుమహల్ శ్రీనగరముపై స్లాబ్ వేయునప్పుడు రెండు మారులు, తీవ్రముగా నడగొట్టుటచే జ్ఞాపకశక్తి కోల్పోయినప్పటి నుండియు, 1985 డిశంబరు నెలలో ఐజట్‌నగర్ రైల్వేస్టేషన్ ప్లాటు ఫారము మీద బరువుఅగు పుస్తకముల పెట్టెను ఎత్తుటచే, వెన్నెముక స్వస్థానము నుండి తప్పి మూడు ముక్కలుగా విరిగి నప్పటి నుంచియు, ఇరువది గజముల దూరము నడిచే శక్తి కూడ పోయి, పరుపుమీద పడిరి. యేనుగు మహల్ శ్రీనగరమునకు సంబంధించిన విషయ ములనన్నిటిని గ్రంథకర్త యొక్క కనిష్ఠ భ్రాతయగు శ్రీ చీమల కొండ శంకరశాస్త్రిగారు పూనుకొని చేయుచున్నారు. పుత్తూరు తీసుకొని వెళ్లి అక్కడ పది రోజులు శల్య చికిత్స చేయించి, శ్రమకు లోనైన శాస్త్రిగారిక్కి గ్రంథ కర్త స్వామి వారికి ఎనలేని సేవ చేసిరి. దానికి శ్రీ స్వామివారు ఎంతయు కృతజ్ఞతా పూర్వక ముగా ధన్యవాదములు సమర్పించుచున్నారు.

శ్రీచక్రముల సందర్భములో ఏ. రామారావుగారు, మూడు శ్రీచక్రములను దిద్ది బాగుచేసి పెట్టినారు.

వేంపాడు, వాస్తవ్యులు హిందీ మేష్టారు శ్రీ వేగేశ్న అప్పలరాజుగారు ఎన్నో విధాల సహాయం చేసిరి. శ్రీ చక్ర పూజా విధానముపై రెండు పుస్తకములు అచ్చు అగునప్పుడు, ఇంతవరకు 5 మాసములు రాత్రింబవళ్లు అవిరామముగా, అన్ని విధముల, తల్లిదండ్రులవలె, కంటిమీద రెప్పలవలె, సేవ చేసిన భీమవరం వాస్తవ్యులు శ్రీమతి బుద్ధిరాజు లీలమ్మగారికి, శ్రీ బి. సత్యనారాయణరాజు గార్కి గ్రంథ కర్త ప్రేమ పూర్వక అనేక ధన్యవాదములు తెలుపుచూ, శ్రీ లలితా అమ్మవారు వారిపై తన దివ్య ఆశీస్సులను కురిపించుగాక అని ప్రార్థించుచున్నారు.

కఠినమగు సంస్కృతపు ఈ పుస్తకములోని భాగము లన్నిటికి సరళమగు అర్థములను, వ్రాసి అందించిన శ్రీ బ్రహ్మశ్రీ నేతు మాధవస్వామి (ప్రిన్సిపల్, ఓరియంటల్ కాలేజి (భీమవరం) గారికి గ్రంథకర్త అనేక ధన్యవాదములు, కృతజ్ఞతలు తెలుపుచున్నారు.

ప్రకాశకులు

శ్రీ రామ జ్ఞానమందిరం, జ్ఞానవిజ్ఞాన విహార్
P. O. గొరగనమూడి Via విస్సాకోడేరు, Pin - 534 244

ఓం

# కృతి సమర్పణము

స్వతంత్రతా మహాసంగ్రామున పాల్గొని, శ్రీకృష్ణ జన్మ స్థానము నలంకరించిన యోధులు దేశోద్ధారక శ్రీ కాశినాథుని నాగేశ్వరరావు పంతులుగారు, ఆంధ్ర పత్రికా సంపాదకులు; చెన్నపురి; దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు, గుంటూరు; బ్రహ్మశ్రీ బులుసు సాంబమూర్తిగారు, కాకినాడ; శ్రీ కళా వెంకటారావుగారు, నా క్లాసుమేటు జైలుమేటు, ఒకప్పుడు ఆంధ్రప్రదేశ్ ఆర్థిక మంత్రి; శ్రీ దువ్వూరి సుబ్బమ్మగారు; కాకినాడ; శ్రీ బ్రహ్మ జ్యోస్యుల సుబ్రహ్మణ్యంగారు, సీతానగరం ఆశ్రమ స్థాపకులు; శ్రీ దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారు రామదండు ప్రవర్తకులు, చీరాల, ప్రకాశంజిల్లా; శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారు, ఆంధ్రప్రదేశపు మొదటి ప్రధానమంత్రి, రాజమహేంద్రవరము; శ్రీ ముష్ఠి లక్ష్మినారాయణగారు, భీమవరం రోజ్‌నర్సరీ, హైద్రాబాద్; శ్రీ సర్దారు దండు నారాయణరాజుగారు, భీమవరం-ఏలూరు; శ్రీ ముదిగంటి జగ్గన్నశాస్త్రిగారు దంపతులు, పల్లెటూరు గ్రంథమండలి, యేనుగుమహల్-తణుకు; శ్రీ తల్లా ప్రగడ ప్రకాశరాయుడుగారు, ధర్మజ్యోతి ప్రకాశకులు, ఉంగుటూరు-హైదరాబాదు; శ్రీ శనివారపు సుబ్బారావుగారు, పల్లెటూరు పత్రికా సంస్థాపకులు, కృష్ణాయపాలెం, పశ్చిమ గోదావరిజిల్లా; శ్రీమతి పొణకా కనకమ్మగారు, భీమవరం; శ్రీ కొవ్వలి గోపాలరావుగారు, తణుకు; వీరందరికిని, ప్రేమ పూర్వకముగను, ఆదర పూర్వకముగను, ఈ కృతి సమర్పణము చేయబడినది.

స్వామి ప్రణవానంద
(శ్రీ కైలాస - మానస సరోవర తీరవాసి)



ముష్ఠి లక్ష్మీనారాయణగారు, అడ్వకేట్
భీమవరం — హైదరాబాద్ రోజ్‌నర్సరీ.



శ్రీ సర్దార్ దండు నారాయణరాజుగారు
భీమవరం — ఏలూరు.



శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయడుగారు, ఎమ్. ఏ.

బాగల్లు హరిజన ఆశ్రమము, ఉంగుటూరు — హైదరాబాద్.

# WORKS OF Dr. SWAMI JNANANANDA

ప్రథమ ముద్రణము : 1987

ప్రతులు : 3000

రచయిత :

పద్మశ్రీ స్వామి ప్రణవానంద

F. R. G. S.

బ్రహ్మశ్రీ విద్యావాచస్పతి

ఆంధ్ర కళాపరిషత్తు.

హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్.

వెల : రు. 3-50

ముద్రణ :



ఫోన్ : 2934

ఆదర్శ ప్రింటర్స్ & పబ్లిషర్స్,

భీమవరం - 534 201

రామ జ్ఞానమందిరము

గొరగనమూడి వారి ఆంగ్ల ఆంధ్ర

ప్రచురములు

**Philosophical**

1) OLIMPSES (22 Poems)
Ss. 10=00
2) PURNAS UTRA-S (Detaile Treatise on the Four yoga-leather binding. Pocketsze)
Rs. 10=00
3) DARSANIKA MAHA - PRAVACHAN
(Four Lactures on Scien and Philosophy delivered Germany) Rs. 10=
4) PHILOSOPHY GF YOGA
Rs. 10=00
5) The Synthesis and the Ulitimate objective of Empiricism and Transcendentalism.

**SCIENTIFIC**

1) High Vacuua, Principles. Production and measurement.
(D. Van Nostrand Company IN C New York (1947)
2) The elements of Nuclear Physics.
(Andhra University) Pulication No. 69-1962
3) Nuclear Models.
(Andhra University Publication)



శ్రీమతి M. లీలావతమ్మగారు
సోషల్ వర్కర్
సర్దార్ దండు నారాయణరాజుగారి ప్రథమ పుత్రిక
కోరుకొల్లు, భీమవరం తాలూకా, ప॥ గో॥ జిల్లా

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 6 | సిద్ధర్థ | సిద్ధ్యర్థం |
| 16 | 6 | కల్పయజనమః | కల్పయామినమః |
| 24 | 6 | వేక | లేక |
| 49 | 5 | కా చారిణి | కామాచారిణీ |
| ,, | 7 | గంసర్వ | గంధర్వ |
| 50 | 9 | గజ్గా | గఙ్గా |
| 51 | 14 | దోగ్ద్రి | దోగ్ధ్రి |
| ,, | 15 | దుష్కృ్తా | దుష్కృ |
| 52 | 7 | మోవహా | మోహమా |
| 56 | 4 | ఖచరా | ఖేచరీ |
| ,, | 9 | హామ | మహా |
| 57 | 6 | చన్ద్రిరేఖాచన్ద్రిరేఖా | చంద్రిరేఖా |
| ,, | 7 | సధా | సుధా |
| ,, | 13 | సిద్ధై | సిద్ధై |
| 58 | 9 | ర్గాషినీ | క్ష్గానినీ |
| ,, | ,, | జ్జ్క్షా | క్ష్జా |
| 61 | 2 | నామావళిః | నామావలిః |
| 64 | ,, | హ్రీ | హ్రీం |
| 64 | 13 | రాసింహైని | రాసింహ్యై |
| ,, | ,, | థం | థ్యం |

# విషయ సూచిక


| | | |
|---|---|---|
| 1. | మందిర ప్రవేశము | 1 |
| 2. | ఆసన పూజ | " |
| 3. | తత్త్వాచమనము | " |
| 4. | దీపము | 2 |
| 5. | ప్రాణాయామము | " |
| 6. | దేశకాల సంస్మరణము (సంకల్పము) | " |
| 7. | గురువందన | 3 |
| 8. | ఘంటా పూజ | 4 |
| 9. | దేహరక్ష | " |
| 10. | దిగ్బంధనము | " |
| 11. | అనుజ్ఞ | 5 |
| 12. | లఘుప్రాణప్రతిష్ఠ | " |
| 13. | కరన్యాసము | " |
| 14. | హృదయన్యాసము | 6 |
| 15. | వాగ్దేవతాన్యాసము | " |
| 16. | మూల విద్యాన్యాసము | 7 |
| 17. | లమిత్యాది పంచపూజ | 8 |
| 18. | వర్ధనీ కలశపూజ | 9 |
| 19. | శంఖ పూజ | " |

20. [illegible] 10
21. ధ్యానము ... ... .... ... 11
22. షోడశోపచార పూజ .... . 13
దశమహా విద్యలు ... .... "
23. శాంతి పాఠం .... .... .. 16
అనుబంధం 1. శ్రీచక్ర మేరు ప్రతిష్ఠ (శ్రీ చక్ర మేరు సర్వస్వము) .... .. .... 17
శ్రీ నగరము .... .... .... ....
శ్రీనగరములోని, తప్పులు దిద్దిన మేరువు ....
తప్పులు దిద్దిన భూప్రస్తార శ్రీచక్రము .... 18
కూర్మ పృష్ఠ శ్రీచక్రము తప్పుది, గేట్లతోటి ... 31
కాశీ అన్నపూర్ణాదేవాలయములోని యంత్రలింగము 33

శ్రీచక్ర మేరువు తప్పుది, భూపుర రేఖలు గేట్లు మెట్లు, దళములు అరసున్న దిమ్మలు వలె నున్నవి.
మాంగాడు (చెన్నపురి దగ్గర) లోని, సిమెంటు అర్ధమేరు-
కూర్మపృష్ఠ శ్రీచక్రము .... .... .... .... 37
శ్రీచక్రమేరువు తప్పుది భూపుర రేఖలు మెట్లు,
పద్మదళములు బ్రాకెట్టు దిమ్మలు .... .... 40
శ్రీచక్ర మేరువు తప్పుది ... .... .... 42
శ్రీచక్రమేరువు, తప్పులు దిద్దినది, యేనుగుమహల్.... 44
శ్రీచక్రమేరువు తప్పుది .... .... .... .... 45

కర్ణప్రయాగదగ్గర వున్న నౌటో వున్న గ్రామములో
తథాకథిత శ్రీచక్రము (వాస్తవమున ఇది
హోమగుండములో వేసే యంత్రముతో .... .... 46
అనుబంధము 2 సౌభాగ్య అష్టోత్తర శతనామావళి ... 47
అనుబంధము 3 దశమహావిద్యలలోని షోడశ
మహావిద్యలలోని లలితా సహస్రనామ స్తోత్రము .... 49
అనుబంధము 4 శ్రీ లలితా త్రిశతీ స్తోత్ర
రత్న నామావళిః ... ... ... 61
అనుబంధము 5 శ్రీచక్ర ఆవాహనకు కావలసిన
సామగ్రి ... ... ... 66
అనుబంధము 6 దేవీఖడ్గమాలా స్తోత్ర నామావళిః ... 67
అనుబంధము 7 గీతపై చిన్నకుల నరసింహంగారి
విమర్శ ... ... ... ... 70
అనుబంధము 8 శ్రీ ప్రజ్ఞానానందస్వామివారి
ప్రస్తావన .... .... .... 78
అనుబంధము 9 దోర్బలపు శోభనాద్రి శాస్త్రిగారి
విజ్ఞప్తి .... .... 82
అనుబంధము 10 దేవ్యపరాధ స్తోత్ర రత్నమ్ 102
అనుబంధము 11 డాక్టర్ స్వామి జ్ఞానానంద 104
అనుబంధము 12 180 శ్రీచక్రములలోని
40 తప్పులు .... .... .... 100



# శ్రీ చక్ర లఘుపూజా విధానము

## 1. మందిర ప్రవేశము :

ఓం ఐం హ్రీం శ్రీం, ఐం క్లీం సౌః, క ఏ ఈ ల హ్రీం హసకహల హ్రీం సకల హ్రీం, శ్రీలలితా మహాత్రిపుర సుందర్యై నమః అని మూడుసార్లు పఠించి, మందిరము (పూజాగృహము) యొక్క కుడివైపు గుమ్మపు కమ్మి మీదను, ఎడమవైపు కమ్మి మీదను, ద్వార బంధము పైనను పుష్పములు వేసి లోపలికి ప్రవేశించవలెను.

## 2. ఆసన పూజ :

"సౌః" అని పదిసార్లు పఠించి, భూమి మీద నీళ్ళ చల్లి, అక్షతలు వేసి దానిపైన ఆసనము వేసికొని, దానిపైన కూర్చుండవలెను.

## 3. తత్త్వాచమనము :

౧. "ఓం ఐం శ్రీం, ఐం, క ఏ ఈ ల హ్రీం, ఆత్మ తత్త్వం శోధయామి స్వాహా; ౨. ఓం ఐం హ్రీం శ్రీం, క్లీం, హసకహల హ్రీం విద్యా తత్త్వం శోధయామి స్వాహా; ౩. ఓం ఐం

హ్రీం, సౌః, సకల హ్రీం శివతత్త్వం శోధయామి స్వాహా;
౪. ఓం, ఐం, హ్రీం, శ్రీం, ఐం, క ఏ ఈ ల హ్రీం, క్లీం, హ స క హ ల హ్రీం సౌః, సకల హ్రీం, సర్వతత్త్వం శోధయామి స్వాహా; అని నాల్గు సార్లు ఆచమనము చేయవలెను.

## 4. దీపము :

శ్రీచక్ర పీఠమునకు కుడి భాగమున గంధపుష్పాక్షతలు వేసి తెల్లవత్తితో నేతి దీపమును, ఎడమవైపున ఎఱ్ఱవత్తితో నూనె దీపమును వెలిగించవలెను.

## 5. ప్రాణాయామము :

మూడు సార్లు ప్రాణాయామము చేయవలెను.

## 6. దేశకాల సంస్మరణము[1] (సంకల్పము) :

శుభే శోభనే ముహూర్తే, అద్య బ్రహ్మణః ద్వితీయ పరార్ధే, శ్వేత వరాహ కల్పే, వైవస్వత మన్వంతరే, అష్టా విశంతి తమే, కలియుగే, ప్రథమ పాదే, జంబూద్వీపే, భారతవర్షే, భరత ఖండే, మేరోర్దక్షిణ పార్శ్వే, శకాబ్దే, అస్మిన్, వర్తమాన వ్యావహారిక ప్రభవాది షష్ఠి సంవత్సరాణాం మధ్యే........ ....నామ సంవత్సరే........అయనే........ఋతౌ .. .... . మాసే........

1. క్రియాంతరం కాలః । రెండు పనుల మధ్యది 'కాలము', ద్రవ్యాంతరం దేశః । రెండు వస్తువుల మధ్యది 'దేశము'.

పక్షే... ... శుభతిథౌ ... .. వాసర యుక్తాయాం. శుభయోగ, కరణ, సకల విశేషణ విశిష్టాయాం, అస్యాం, శుభతిథౌ ........ నామగోత్ర.... .....మమోపాత్త సమస్త దురిత క్షయద్వారా, శ్రీ పరమేశ్వరీ ప్రీత్యర్థం. అస్మాకం క్షేమ స్థైర్య వీర్య విజయ-ఆయురారోగ్యైశ్వర్యాభి వృద్ధ్యర్థం, ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ పురుషార్థ ఫల సిద్ధ్యర్థం, సమస్త మంగళా వాప్త్యర్థం సమస్త దురితోప శాంత్యర్థం, మమ మోక్ష సామ్రాజ్య సిద్ధ్యర్థం శ్రీ రాజరాజేశ్వరీ లలితామహాత్రిపురసుందరీ ప్రీత్యర్థం, నిత్య పూజాం కరిష్యే (అని అనామికతో కలశలోని నీటిని తాకవలెను).

## 7. గురువందన :

*1. అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా।
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః॥

2. అఖండ మండలాకారం, వ్యాప్తం యేన చరాచరమ్।
తత్పదం దర్శితం యేన, తస్మై శ్రీగురవే నమః॥

3. మంగలం గురుదేవాయ మహనీయాయ గుణాత్మనే।
సర్వదేవ మహాత్మనే, గురుపాయ మంగలమ్॥

---

*1. అజ్ఞానము అను చీకటి చేత అంధుడైన వానికి, జ్ఞానము అను కాటుక కడ్డీతో ఏ గురువుచే నేత్రము తెరువబడినదో, అట్టి గురువునకు నమస్కారము.

2. ఏ పరమాత్మచేత అఖండ మండలాకారమైన చరాచర ప్రపంచము వ్యాపింపబడి యున్నదో, అట్టి పదము ఏ గురువుచే చూపింపబడినదో అట్టి గురువునకు నమస్కారము.

## 8. ఘంటా పూజ :

"ఓం జయధ్వని మంత్రి మాతః స్వాహా, ఆగమార్థంతు దేవానాం, గమనార్థంతు రాక్షసామ్" ।

అని ఘంటకు గంధమురాసి, అక్షతలు, పువ్వులు దానిపైన వేసి, ఘంట వాయించవలెను.

## 9. దేహరక్ష :

"ఓం ఐం హ్రీ శ్రీం శ్రీమహాత్రిపురసుందరీ ఆత్మానం రక్ష రక్ష" అని శరీరముపైన చేతిని మూడు సార్లు త్రిప్పవలెను.

## 10. దిగ్బంధనము :

"ఓం ఐం హ్రీం శ్రీం, ఓంనమో భగవతి జ్వాలామాలినీ, దేవదేవి సర్వభూత సంహారకారికే జాతవేదసి జ్వలంతి జ్వల జ్వల ప్రజ్వల ప్రజ్వల హ్రాం హ్రీం హ్రూం ర ర ర ర ర ర ర ఫట్ స్వాహా" ఇతి పరితో వహ్ని ప్రాకారం విభావ్యం భూర్భువస్సువరోం ఇతి దిగ్బంధః.

---

3. గొప్పదయిన గుణములు గల యట్టి గురువునకు మంగళము గురుగారు సమస్త దేవతలకన్న మహనీయుడైనట్టి గురుస్వరూపునకు మంగళము. (ఇక్కడ ఆ శ్రీ లలితా మహాత్రిపురసుందరి భట్టారికయే, ఆ గురువుగా నెరుగునది.)

## 11. అనుజ్ఞ :

"ఓం ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః". సమస్త[8] 1. ప్రకట, 2. గుప్త, 3. గుప్తతర, 4. సంప్రదాయ, 5. కులోత్తీర్ణ, 6. నిగర్భ, 7. రహస్య, 8. అతిరహస్య, 9. పరాపరాతి రహస్య యోగినీ దేవతాభ్యోనమః," అని శ్రీ చక్రము మీద పుష్పాంజలి (దోసిలితో పువ్వులు) ఇయ్యవలెను.

## 12. లఘు ప్రాణ ప్రతిష్ఠ :

ఓం ఐం హ్రీం శ్రీం ఓం ఆం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం, ఓం హంసః సోహం, సోహం హంసః శివః, శ్రీ చక్రస్య ప్రాణా ఇహ ప్రాణాః,

ఓం ఐం హ్రీం శ్రీం ఓం హ్రీం క్రోం శ్రీచక్రస్య జీవ ఇహస్థితః, సర్వేంద్రియాణి వాక్ మనశ్చక్షుః శ్రోత్రజిహ్వా ఘ్రాణా ఇహైవాగత్య అస్మిన్ చక్రే సుఖం చిరం తిష్టంతు స్వాహా.

## 13. కరన్యాసము :

1. ఓం ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః, అం, కం ఖం గం ఘం ఙం, ఆం, అంగుష్ఠాభ్యాంనమః;

---

8. ఈ తొమ్మిటిన్నీ శ్రీచక్రములోని, నవ ఆవరణములు లేక చక్రముల యొక్క యోగినీ గణముల యొక్క పేర్లు.

2. [4]ఓం[7], ఇం, చంఛం జం ఝం ఞం, ఈం, తర్జనీభ్యాం నమః;

3. ఓం[7], ఉం, టంఠం డం ఢం ణం, ఊం, మధ్యమాభ్యాం నమః;

4. ఓం[7], ఏం, తం థం దంధంనం, ఐం. అనామికాభ్యాం నమః;

5. ఓం[7], పం, పంఫం బంభం మం, ఔం, కనిష్ఠికాభ్యాం నమః;

6. ఓం[7], అం, యం రం లం వంశం సం హం ళం క్షం అః, కరతలకరపృష్ఠాభ్యాంనమః.

## 14. హృదయాది న్యాసము :

1. ఓం[7], అం, కం....జం అం హృదయాయనమః, 2. ఓం[7], ఇం, చం....ఞ ఈం శిరసే స్వాహా, 3. ఓం[7], ఉం, టం....ణం ఊం శిఖాయైవషట్, 4. ఓం[7], ఏం; తం....నం, ఐం, కవచాయ హుం, 5. ఓం[7] పం, ఫం....మం, ఔం, నేత్రత్రయా వౌషట్, 6. ఓం[7] అం, యం....ళం క్షం, అస్త్రాయఫట్ భూర్భువ స్సువరోమితి దిగ్బంధః.

## 15. వాగ్దేవతా న్యాసము :

1. ఓం ఐం హ్రీం శ్రీం; అం .. ... అః ర్బ్లూం వశినీ వాగ్దేవతాయైనమః (శిరసి);

---

4 ఓం7 = ఓం ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః

2. ఓం ఐం హ్రీం శ్రీం; కం...... ఙం క్లీం కామేశ్వరీ వాగ్దేవతాయైనమః (లలాటే);

3. ఓం ఐం హ్రీం శ్రీం; చం ... ... ఞం స్వ్లూం మోదినీ వాగ్దేవతాయైనమః (భ్రూమధ్యే);

4. ఓం ఐం హ్రీం శ్రీం. టం.... ణం య్లూం విమలా వాగ్దేవతాయైనమః (కంఠే);

5 ఓం ఐం హ్రీం శ్రీం, తం........నం జ్ర్మ్రీం అరుణా వాగ్దేవతాయైనమః (హృదయే);

6. ఓం ఐం హ్రీం శ్రీం; పం... ....మం హ్స్ల్వ్య్రూం జయనీ వాగ్దేవతాయైనమః (నాభౌ);

7. ఓం ఐం హ్రీం శ్రీం యం.. ....వం ఝ్మ్ర్యూం సర్వేశ్వరీ వాగ్దేవతాయైనమః (గుహ్యే);

8. ఓం ఐం హ్రీం శ్రీం శం షం సంహంళం క్షం క్ష్మ్రీం కౌలినీ వాగ్దేవతాయైనమః (మూలాధారే).

## 16. మూల విద్యాన్యాసము :

1. ఓం ఐం హ్రీం శ్రీం కం; నమః (శిరసి); 2. ఓం ఐం హ్రీం శ్రీం ఏం నమః (మూలాధారే) ; 3. ఓం ఐం హ్రీం శ్రీం ఈం నమః (హృదయే); 4 ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం నమః (దక్షనేత్రే) 5. ఓం ఐం హ్రీం శ్రీం నమః (వామనేత్రే); 6. ఓం ఐం హ్రీం శ్రీం హం, నమః (భ్రూమధ్యే); 7. ఓం ఐం హ్రీం శ్రీం సం; నమః (దక్షశ్రోత్రే); 8. ఓం ఐం హ్రీం శ్రీం కం నమః (వామశ్రోత్రే); 9. ఓం ఐం హ్రీం శ్రీం హం, నమః (ముఖే);

10. ఓం ఐం హ్రీం శ్రీం లం, (దక్షభుజే); 11. ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం, నమః (వామభుజే); 12. ఓం ఐం హ్రీం శ్రీం నం, నమః (పృష్ఠే); 13 ఓం ఐం హ్రీం శ్రీం కం నమః (దక్షజానుని-కుడి పిక్క); 14 ఓం ఐం హ్రీం శ్రీం లం, నమః (వామ జానుని-ఎడమ పిక్క); 15. ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం, నమః (నాభౌ)

## 17. లమిత్యాది పంచపూజ :

1. లం, పృథ్వీ తత్త్వాత్మికాయై శ్రీలలితా మహాత్రిపురసుందరీ దేవ్యై, కనిష్ఠకాభ్యాం గంధం పరికల్పయామి నమః;
2. హం, ఆకాశ తత్త్వాత్మికాయై శ్రీలలితామహాత్రిపురసుందరీ దేవ్యై, అంగుష్ఠాభ్యాం పుష్పం పరికల్పయామి నమః;
3. యం, వాయు తత్త్వాత్మికాయై శ్రీలలితామహాత్రిపుర సుందరీ దేవ్యై తర్జనీభ్యాం ధూపం పరికల్పయామి నమః;
4. రం, తేజో తత్త్వాత్మికాయై శ్రీలలితామహాత్రిపురసుందరీ దేవ్యై మధ్యమాభ్యాం దీపం పరికల్పయామి నమః;
5. వం, అపోతత్త్వాత్మికాయై శ్రీలలితామహాత్రిపురసుందరీ దేవ్యై అనామికాభ్యాం అమృత నైవేద్యం, తాంబూలకర్పూర నీరాంజనాది సర్వోపచారాన్ కల్పయామి నమః;
6. [5]సం, సర్వ తత్త్వాత్మికాయై శ్రీలలితా మహాత్రిపురసుందరీ

---

5 ప్రక్షిప్తం (తరువాత చేర్చబడినది), అందుచేత దీనిని చేయ నవసరములేదు.

దేవ్యై కరతల కరపృష్ఠాభ్యాం తాంబూలాది సర్వోపచారాన్ కల్పయామి నమః.

## 18. వర్ధనీ కలశ పూజ :

నీళ్ల చెంబునకు మూడు ప్రక్కల గంధం, అక్షతలు, కుంకుమ, పుష్పాలు అద్ది లోపల ఒక పుష్పం వేసి, కలశపై చెయ్యి పెట్టి అగ్నిమండలాయనమః, ఆదిత్య మండలాయనమః సోమ మండలాయనమః, కలశస్యముఖే విష్ణుః,కంఠే రుద్రః సమాశ్రితః. మూలే తత్రస్థితో బ్రహ్మ,మధ్యే మాతృ గణాః స్మృతా॥కుక్షౌతు సాగరాః సర్వే సప్తద్వీపా వసుంధరా। ఋగ్వేదోఽథ యజుర్వేద స్సామ వేదో హ్యథర్వణః॥ అంగైశ్చ సహితా స్సర్వే కలశాంబు సమాశ్రితాః॥ బ్రహ్మాండోదర తీర్థాని కంఠైః, స్పృష్టాని తే రవే. తేన సత్యేన వేదేవ తీర్థం దేహి దివాకర గంగే చ యమునే చైవ గోదావరి కృష్ణా, సరస్వతీ, నర్మదే సింధు కావేరి జలేఽస్మిన్ సన్నిధింకురు॥ సర్వేసముద్రా: సరిత: తీర్థాని చ సదా పవిదాః, ఆయాంతు దేవీ పూజార్థం దురితక్షయ కారకా:॥ ఓం ఐం హ్రీం శ్రీం అని మంత్రించి. ఆ నీటిని పుష్పంతో తీసి పూజా ద్రవ్యముల మీదను తన తల మీదను చల్లుకొనవలెను.

## 19. శంఖపూజ (సామాన్యార్ఘ్యం) :

శంఖమున్నచో వర్ధనీ కలశకు కుడి ప్రక్కను, భూమి మీద ఓం ఐం హ్రీం శ్రీం, అని వర్ధనీ కలశలోని నీటిని చల్లి, అక్షతలు వేసి, దానిమీద శంఖమును పెట్టవలెను.

అగ్నిమండలాయ నమః, సూర్యమండలాయ నమః, చంద్రమండలాయనమః, అని మంత్రించి కలశలోని నీళ్లను ఉద్ధరిణితో శంఖమును పూరించవలెను. తరువాత పువ్వుతో ఆ నీటిని పూజాద్రవ్యముల మీదను, తన తల మీదను చల్లుకొనవలెను.

## 20. అంతర్యాగము :

కుండలి వ్యధిష్ఠితం చిదగ్ని మండలాయనమః, ఇతి మనసా సంపూజ్య (మానసికముగ పూజింపవలెను)

ఓం ఐం హ్రీం శ్రీం పుణ్యం జుహోమి స్వాహా,
ఓం ఐం హ్రీం శ్రీం పాపం జుహోమి స్వాహా,
ఓం ఐం హ్రీం శ్రీం కృత్యం జుహోమి స్వాహా,
ఓం ఐం హ్రీం శ్రీం అకృత్యం జుహోమి స్వాహా,
ఓం ఐం హ్రీం శ్రీం సంకల్పం జుహోమి స్వాహా,
ఓం ఐం హ్రీం శ్రీం వికల్పం జుహోమి స్వాహా,
ఓం ఐం హ్రీం శ్రీం ధర్మం జుహోమి స్వాహా,
ఓం ఐం హ్రీం శ్రీం అధర్మం జుహోమి స్వాహా,
ఓం ఐం హ్రీం శ్రీం అధర్మం జుహోమి వౌషట్

## 21. ధ్యానము :

అథ దేవ్యా ప్రేరిత మానసః సన్ పునః ప్రకృతిమాలంబ్య, తేజో రూపేణ పరిణతాం పరమశివ జ్యోతి రభిన్న ప్రకాశాత్మికాం వియదాది విశ్వకారణాం సర్వావభాసికాం, స్వాత్మాభిన్నాం, పరచితిం, సుషుమ్నా పథేన ఉద్గమ్య వినిర్భిన్న విధిబిల విలసదమల దళశతదళ కమలాత్ వహన్నాసా పుటేన నిర్గతాం త్రిఖండా ముద్రామండిత శిఖండే, కుసుమగర్భితే, అంజలే సమానీయ, ఓం ఐం హ్రీం శ్రీ సౌః శ్రీలలితాయాం అమృత చైతన్యమూర్తిం కల్పయామి నమః.

6. ఇపుడు, దేవి చేత ప్రేరణ చేయబడిన మనస్సు గలవాడనై తిరిగి (ప్రకృతి) స్వభావమును ఆధారముగా చేసుకొని, తేజోరూపముగా పరిణమించి నట్టిన్ని, పరచితి తేజస్సుకంటె భేదముకాని ప్రకాశస్వరూపిణి అయినటువంటిన్ని, ఆకాశాది సమస్త భూతములకు కారణ స్వరూపిణి అయినట్టిన్ని సమస్తమును ప్రకాశింపజేయునట్టిదియు, తన ఆత్మ కంటె భేదము కానిదియునగు పరమచితిని సుషుమ్నా మార్గద్వారమున ఊర్ధ్వముగా లేవదీసి, భేదింపబడిన బ్రహ్మరంధ్ర మందు ప్రకాశించుచు స్వభావమైన సహస్రార కమలమందు నిలిపి, నాసారంధ్రము ద్వారమున వెలుపలకు నిర్గమించిన పరచితిని, త్రిఖండ ముద్రచేత అలంకృతమైన శిఖండము కలిగినట్టి పుష్ప గర్భమైనట్టి దోసిలియందు తీసికొనివచ్చి, ఓం ఐం హ్రీం శ్రీం సౌః అను మంత్రముచేత లలితాదేవికి చైతన్య రూపము కల్పించి, నమస్కరించి, ఈ క్రింది విధముగ ధ్యానించుచున్నాను.

[7]ఇక్షుకోదండ పుష్పేషు పాశాంకుశ చతుర్భుజామ్ ।
సర్వదేవ మయీ మంబాం సర్వసౌభాగ్య సుందరీమ్॥1
సర్వతీర్థ మయీందివ్యాం సర్వకామ ప్రపూరిణీమ్ ।
సర్వ మంత్ర మయీ నిత్యాం సర్వాగమ విశారదామ్ ॥2
సర్వ క్షేత్ర మయీం సర్వదేవీం విద్యామయీం శివామ్ ।
సర్వయాగ మయీం విద్యాం సర్వదేవస్వరూపిణీమ్ ॥3
సర్వశాస్త్ర మయీం నిత్యాం సర్వాగమ నమస్కృతామ్॥4
సర్వానంద మయీం జ్ఞాన గహ్వరాం సంవిదం పరామ్ ।
ఏవం ధ్యాయేత్పరా మంబాం సచ్చిదానందరూపిణీమ్ ॥5

7. 1. చెరకు విల్లు, పుష్ప బాణములు, పాశము, అంకుశము కలిగినట్టి నాలుగు భుజములు కలదియు, సమస్త దేవతా స్వరూపిణియు, సమస్త సౌభాగ్యములు కలదియు అయినట్టితల్లిని, 2. సమస్త తీర్థముల స్వరూపము అయినట్టియు, సర్వదేవతా స్వరూపిణి అయినట్టియు, సమస్తమైన కోరికలను ఇచ్చునట్టిదియు, సమస్తమంత్ర స్వరూపిణి అయినట్టిదియు, సర్వతంత్రములందును నిపుణురాలైనట్టియు. 3. అన్ని క్షేత్రములయొక్క స్వరూపిణియు, సమస్త విద్యలయొక్క స్వరూపిణియు సర్వమంగళ స్వరూపిణియు అయినట్టి దేవిని, సమస్త యాగముల యొక్క స్వరూపిణియై నట్టియు, సర్వవిద్యా స్వరూపిణియు అయి నట్టియు, సమస్త దేవతా స్వరూపిణియు అయిన సర్వమంగళ స్వరూపిణియు అయిన దేవిని, 4. సమస్త శాస్త్ర స్వరూపిణియు, నిత్యస్వరూపిణియు, సమస్త ఆగమములచే నమస్కరింప బడినట్టిదియు, 5. సర్వానంద మయమైనదియు జ్ఞానముచే దట్టమైనదియు (సర్వజ్ఞాన మైనట్టిదియు) జ్ఞాన గుహయందు తెలిసి కొనబడదగినట్టిదియు అయిన ఆ పరమతల్లిని, సచ్చిదానంత రూపిణి అయిన ఆ 'అంబ'ను ఈ ప్రకారముగా పైన చెప్పిన విధముగ ధ్యానము చేయవలెను.

## 22. షోడశోపచార పూజ :

1. ఆహ్వానము (పిలుపు): ఓం ఐం హ్రీం శ్రీం హ్స్రైః హ్సకల్రీం హ్సౌః,

మహా పద్మాసనాంతిస్థే కారణానంద విగ్రహే ।
సర్వభూత హితే మాతః ఏహ్యేహి పరమేశ్వరి ॥
ఏహ్యేహి దేవ దేవేశి త్రిపురే దేవపూజితే ।
పరామృత ప్రియే శీఘ్రం సాన్నిధ్యం కురు సిద్ధిదే॥
దేవేశి భక్త సులభే సర్వా వరణ సంవృతే ।
యావత్త్వాం పూజ యిష్యామి స్తావత్త్వం సుస్థిరాభవ॥

### [9]దశమహావిద్యలు :

"చంక్రమణాత్ చక్రమ్" తిరుగునది గాబట్టి చక్రము. బ్రహ్మాండము నిరంతరము కదులు చుండుట చేతను, మార్పు

---

9. (1) కాళీ లేక మహాకాళీ; బీజము, క్రీం, కైవల్యదాయినీ.
(2) తారా : హుం ; తత్త్వ విద్యాదాయినీ, త్వరితఫలదా, భోగదా.
(3) సుందరీ, షోడశీ, మహాత్రిపురసుందరీ శ్రీం,
మోక్షధాత్రీ, జీవన్ముక్తి ప్రదా, భోగదా.
(4) భువనేశ్వరీ: హ్రీం ; స్వరూపజ్ఞానకారీ.
(5) భైరవీ ; హ్స్రైం హ్సౌం ; బుద్ధిదా.
(6) ఛిన్నమస్తా ; ఫట్ ; శత్రు ~~ఛేదకరీ.~~
(7) ధూమవతీ ; ధూంధూం ; ధర్మదా.
(8) బగలా, బగ్లాముఖీ, పీతాంబరా ; ఓం హ్లీం ; వాక్స్తంభన కారీ.
(9) మాతంగీ : ఓం హ్రీం క్లీం హూం ; మానదా.
(10) కమలా ; మహాలక్ష్మీ; ఐం హ్రీం శ్రీం క్లీం హ్సౌః లాలిత్య ప్రదా.
యత్రాస్తి మోక్షో న చ తత్రభోగః।

చెందుచున్నందుటచేతను, తిరుగుచుండుటచేతను దీనికి శ్రీచక్రము అని పేరిడ బడినది. ఏదేని మంత్రము పండ్రెండు కంటె ఎక్కువ బీజాక్షరములు కలిగి యుండినచో అది స్త్రీ దేవతను సంబంధించి యుండినచో దానిని "విద్యా" అని అందురు. అందుచే మహాత్రిపుర సుందరీ మంత్రమునకు శ్రీవిద్య అను పేరు కలిగినది. దానికి సంబంధించిన యంత్రమును శ్రీచక్రమని అందురు. తంత్ర శాస్త్రమున ముఖ్యమైనవి పది మహా విద్యలు గలవు, ఆదశమహా విద్యలు, ఈ క్రింద పేర్కొనబడినవి. దశమహావిద్యలను గ్రంథము సంస్కృతమున దేవనాగరి లిపిలో బొంబాయిలోని శ్రీ వెంకటేశ్వర ప్రెస్సునందు అచ్చు వేయబడినది.

1. ఓం ఐం హ్రీం శ్రీం శ్రీలలితా మహాత్రిపురసుందరీ ఆవాహితా భవ;

2. ఓం ఐం హ్రీం సంస్థాపితా భవ; ఓం ఐం హ్రీం శ్రీం సన్నిహితా భవ (సమీపముగా) (3) ఓం ఐం హ్రీం శ్రీం సన్నిరుద్ధా భవ (స్థిరముగా); (4) ఓం ఐం హ్రీం శ్రీం సమ్ముఖీ భవ (ఎదురుగా); (5) ఓం ఐం హ్రీం శ్రీం అవకుంఠితా భవ (కప్పబడిన దానివగు); (6) ఓం ఐం హ్రీం శ్రీం సుప్రీతాభవ; (7) ఓం ఐం హ్రీం శ్రీం ప్రసీద ప్రసీద;

---

శ్రీ సుందరీ సేవక పుంగవానాం భోగశ్చ మోక్షశ్చ కరస్థ ఏవ ॥

ఎక్కడ భోగమున్నదో అక్కడ మోక్షములేదు. ఎక్కడ మోక్షమున్నదో అక్కడ భోగములేదు. సుందరీసేవక శ్రేష్ఠులకు భోగము మోక్షము కూడ కరతలామలకములు.

2. ఓం ఐం హ్రీం శ్రీం ఆసనం కల్పయామి నమః;
3. ఓం ఐం హ్రీం శ్రీం పాద్యం కల్పయామి నమః;
4. ఓం ఐం హ్రీం శ్రీం అర్ఘ్యం కల్పయామి నమః. ఓం.
5. ఓం ఐం హ్రీం శ్రీం ఆచమనీయం కల్పయామి నమః. ఓం.
6. ఓం ఐం హ్రీం శ్రీం స్నానం (సకలతీర్థాభిషేకం పంచామృత స్నానం ఉష్ణోదకస్నానం శుద్ధోదక స్నానం) కల్పయామి నమః ఓం.
7. ఓం ఐం హ్రీం శ్రీం వస్త్రం కల్పయామి నమః ఓం.
8. ఓం ఐం హ్రీం శ్రీం యజ్ఞోపవీతం కల్పయామి నమః ఓం.
9. ఓం ఐం హ్రీం శ్రీం గంధం సర్వాంగేణ విలేపనం కల్పయామినమః ఓం.
10 ఓం ఐం హ్రీం శ్రీం పుష్ప (మాలాం) కల్పయామి నమః
11 ఓం ఐం హ్రీం శ్రీం ఆనందోల్లాస విలాస హాసం (చిరునవ్వు) కల్పయామినమః ఓం. ఓం ఐం హ్రీం శ్రీం [10]మధుపర్కం కల్పయామినమః
12. ఓం ఐం హ్రీం శ్రీం ధూపం కల్పయామి నమః; ఓం ఐం హ్రీం శ్రీం దీపం కల్పయామినమః (మంగళరారతికి); 9 గురువులు కాని, 9 వత్తులు కాని, లేక వీలైనన్ని గాని).

---

శ్రీచక్రమునకు గాని, మరి ఏ ఇతర దేవతకు గాని ప్రక్కన నిలువబడి పూజ చేయుట శాస్త్ర విరుద్ధమని తప్పిదమని తెలిసికొనుడు. దేవతకు ఎదురుగా కూర్చునియే అర్చన చేయవలెను.

(10) దధి సర్పిః జలం క్షీరం సితా ఏతైశ్చ పంచభిః ప్రోచ్యతే మధుపర్కః : పెరుగు, నెయ్యి, నీళ్ళు, తేనె, పంచదార ఈ ఐదును కలిపి మధుపర్కమన బడుచున్నది.

13. ఓం ఐం హ్రీం శ్రీం నైవేద్యం కల్పయామినమః; ఓం ఐం హ్రీం శ్రీం కర్పూర వీటి కాయాయ నమః (వెంటనే వేసుకొనుటకు వీలైన తాంబూలము కిళ్లీ).

14. ఓం ఐం హ్రీం శ్రీం కర్పూర నీరాజనం హారతికర్పూరం ఆభరణం. అద్దం, చామరం, ఛత్రం, అంజనం (కాటుక) స్తోత్రం, గానం (పాట) కల్పయ జనమః

## 23. శాంతి పాఠం :

ద్యౌః శాంతిర న్త రిక్షగ్ం శాంతి పృథ్వీ శాంతి రాపః శాంతి దోషదయః శాంతి వనస్పతయః శాంతిర్విశ్వేదేవాః శాంతి ర్బ్రహ్మ శాంతి స్సర్వగ్ం శాంతి: శాంతిరేవ, శాంతి స్సామా శాం, తేధి, శాంతి: శాంతి: శాంతి: ఓం. శుక్రవారమునాడు. అష్టమినాడు, పూర్ణిమనాడు, వీలునుబట్టి లలితాష్టోత్తర శతనామావళితోగాని, లలితా సహస్రనామ స్తోత్రముతోగాని. [11] త్రిశతితోగాని, ఖడ్గమాలా స్తోత్రముతోగానిః సౌభాగ్య అష్టోత్తర శతనామావళితో గాని పసుపుతో చేయబడిన కుంకుమతోగానిః సౌభాగ్య అష్టోత్తర శతనామావళితోగాని పసుపుతో చేయబడిన కుంకుమతో పూజ చేయవలెను.

---

(11) త్రిశతి స్తోత్రములో మూల పంచా దశాక్షరిలోని క ఏ ఈ ల హ్రీం హసకహల హ్రీం సకల హ్రీం అను 15 బీజా క్షరములతోను ఒక్కొక్క దానితో ప్రారంభించి ఇరువదేసి 15 × 20 = 300 నామములు చెప్పబడినవి. అనగా త్రిశతి మూల మంత్రము యొక్క బీజాక్షరములచే భావన చేయబడుట దీని విశిష్ఠత. అందుచే, మూల మంత్రముతో దీక్షితులు కాని వారు కూడ మూల మంత్ర జపము వలన కలుగు ఫలమును పొంద కలుగుదురు. ఇది తాంత్రిక

ఓం

అనుబంధము 1

# శ్రీ చ్ర మేరుప్ర ష్ఠ

## (శ్రీచక్ర సర్వస్వము)





యేనుగుమహల్ శ్రీనగరములో ప్రతిష్ఠ చేయబడిన శ్రీచక్రమేరువు. 3', 3'×3'' ఆంధ్ర స్థపతుంచే హైదరాబాదులో చెక్కబడినది. తప్పులన్నియు దిద్ది చేయించబడి నది. మెరుగు పట్టిన నల్లసాలిగ్రామశిల (గ్రైనైటు) రాయిపై చెక్కబడినది.

స్వస్తిశ్రీ చాంద్రమాన ఫాల్గుణ శుక్ల పూర్ణిమా సోమవారం (*28-3-1983* తేది) ఉదయం గం॥ ***9-44*** ని॥లకు ఉత్తర ఫల్గుణీ నక్షత్రయుక్త వృషభలగ్నమందు

## గౌతమీతీరమున యున్న అశ్వత్థ పిప్పలాయన క్షేత్రమున యేనుగుమహల్ గ్రామమునందు

## పద్మశ్రీ శ్రీ108 ప్రణవానంద స్వాములవారిచే

(శ్రీ కైలాస మానససరోవర తీరవాసులు)

## నూతనముగా నిర్మింపబడిన శ్రీనగరమునందు

(శ్రీచక్రాలయమునందు)

శ్రీచక్ర ప్రతిష్ఠాపనము ఏకాహ్నిక దీక్షతో స్వయముగా శ్రీ స్వాములవారిచే జరుపబడినది. భక్తులెల్లరు విచ్చేసి ఈ మేరువును దర్శించి శ్రీ లలితా మహాత్రిపురసుందరీ రాజరాజేశ్వరీ అమ్మవారియొక్క తీర్థప్రసాదములను స్వీకరించి కృతార్థులయిరి.

మార్గము:- తూర్పుగోదావరి జిల్లా రావులపాలెం జంక్షను నుంచి అమలాపురం పోవు బస్సుమార్గములో యేనుగుమహల్-మందపల్లి స్టాపులో దిగవలెను. రాజమండ్రీ, కాకినాడ, ఏలూరు, తాడేపల్లిగూడెం, నర్సాపురం, భీమవరం, విజయవాడ, గుంటూరు, హైదరాబాదు, వాల్తేరు, పట్టణముల నుంచి బస్సుల సౌకర్యము కలదు. రాజమండ్రీ పెద్ద స్టేషనులో దిగి, బయటనే యున్న

బస్సుస్టాండులో అమలాపురం వెళ్ళే బస్సు ఎక్కి-
మందపల్లి – యేనుగుమహల్ స్టాపులో దిగవలెను.

శ్రీ చ క్ర ఉ ద్ధా ర శ్లో క ము :

బిందు-త్రికోణ-వసుకోణ-దశారయుగ్మ-
మన్వశ్ర-నాగదలసంయుత-షోడశారమ్ ।
వృత్తత్రయం చ ధరణీ సదనత్రయం చ
శ్రీచక్రమేత దుదితం పరదేవతాయాః॥ రుద్రయామలతంత్రే॥

శ్రీచక్రమును గురించి తెలిసికొన దలచుకొన్న వారందరును ఈ శ్లోకమును పఠించి కంఠస్థము చేసికొందురు గాక



తప్పులు దిద్దిన భూప్రస్తార శ్రీచక్రము

*1.* బిందుచక్రము (సర్వానందమయ చక్రము)

శ్రీ లలితా మహాత్రిపురసుందరీ రాజరాజేశ్వరీ పరా భట్టారికా; బింద్వాత్మిక పరబ్రహ్మాత్మకము. నాదబిందు కళాత్మకము. నాదప్రకృతికము. శ్రీ మహాత్రిపురసుందరీ చక్రేశ్వరీ; పరాపరాతిరహస్యయోగిని; శ్రీ లలితా మహాత్రిపురసుందరీ పరా భట్టారిక ఈ చక్రమునందేకాక మిగిలిన ఎనిమిది చక్రములందు కూడ పూజింపబడును. సర్వయోనిముద్ర. బాలార్క-పు రంగుకలది. రతి స్థాయీభావము; శృంగారరసాత్మకము.

**2. త్రికోణ చక్రము** (సర్వసిద్ధప్రద చక్రము) హ్స్రైం హ్స్క్లీం, హ్స్రౌః. (1) ఐం క ఏ ఈ ల హ్రీం బ్రహ్మాత్మక శక్తి-మహాకామేశ్వరీ, (2) క్లీం హసకహల హ్రీం విష్ణ్వాత్మక శక్తి-మహావజ్రేశ్వరీ, (3) సౌః సకల హ్రీం రుద్రాత్మకశక్తి-మహాభగమాలిని. రేఖాత్రయాత్మకము; సర్వబీజముద్రా; నాద ప్రకృతికము; ఆదిశక్తి-మూలప్రకృతి; గుణత్రిశక్తిరూపము; బ్రహ్మాత్మశక్తి; మహాకామేశ్వరీ; విష్ణ్వాత్మక శక్తి-మహావజ్రేశ్వరీ; రుద్రాత్మశక్తి-మహాభగమాలినీ; త్రిపురాంబా, చక్రేశ్వరీ; అతి రహస్యయోగినీ; పూజ-ప్రదక్షిణపూర్వకముగ; మందారపువ్వు రంగు; (గాఢపు ఎరుపు); శమ స్థాయీ భావము; శాంతరసాత్మకము.

**3 అష్టారచక్రము** (సర్వరోగహర చక్రము) హ్రీం శ్రీం సౌః అం, ఆం, ఇం, ఈం, ఉం, ఊం, ఋం, ౠం, ఌం, ౡం, ఏం, ఐం, ఓం, ఔం, క్లేం అం, అః, (1) వశినీ

వాగ్దేవతా, (2) కం, ఖం, గం, ఘం, ఙం, క్లీం, కామేశ్వరీ వాగ్దేవతా, (3) చం, ఛం, జం, ఝం, ఞం, న్బ్లూం, మోదినీవాగ్దేవతా, (4) టం, ఠం, డం, ఢం, ణం, య్లూం, విమలా వాగ్దేవతా, (5) తం, థం దం, ధం, నం, జ్మ్రీం, అరుణావాగ్దేవతా, (6) పం, ఫం, బం, భం, మం, హ్స్ల్వ్యూం, జయినీ వాగ్దేవతా, (7) యం, రం, లం, వం, ఝ్మ్య్రూం; సర్వేశ్వరీవాగ్దేవతా; (8) శం, షం, సం, హం, ళం, క్షం, క్ష్మ్రీం, కౌలినీ వాగ్దేవతా; కకార ప్రకృతికము; అష్టమూర్త్యాత్మకము; మాహేశ్వరీ స్వరూప మైనది; ఇందు దేవ్యగ్రకోణమునుంచి ప్రారంభించి పూజ వామా వర్తము; రహస్యయోగినీ; త్రిపురాసిద్ధ చక్రేశ్వరీ; పద్మరాగపు రంగు (తామరపువ్వు); హాస స్థాయీభావము; హాస్య రసాత్మకము.

<u>4. అంతర్దశారచక్రము</u> (సర్వరక్షాకరచక్రము) హ్రీం; క్లీం; బ్లేం (1) మం; సర్వజ్ఞాదేవీ; (2) యం; సర్వశక్తిప్రదాదేవీ; (3) రం; సర్వైశ్వర్యప్రదాదేవీ; (4) లం; సర్వజ్ఞానమయీదేవీ; (5) వం; సర్వవ్యాధివినాశినీదేవీ; (6) శం; సర్వాధార స్వరూపా దేవీ; (7) షం; సర్వపాపహరాదేవీ; (8) సం; సర్వానందమయీ దేవీ; (9) హం; సర్వరక్షాస్వరూపిణీదేవీ; (10) క్షం; సర్వేప్సిత ఫలప్రదాదేవీ. మహాంకుశాముద్ర; మకార ప్రకృతికము; త్రిపుర మాలినీ చక్రేశ్వరీ; నిగర్భయోగినులు; దశకలాత్మక వైశ్వానరా భిన్నే. దేవ్యగ్రకోణముతో ప్రారంభము చేసి వామావర్తముగ

పూజ, దశాకలాత్మకమగు స్వరూపము; త్రిపురమాలిని చక్రేశ్వరి. మందారపుష్పరంగు కలది; క్రోధము స్థాయీ భావము రౌద్రరసాత్మకము.

<u>5. బహిర్దశార చక్రము</u> (సర్వార్థ సాధక చక్రము) హ్రైం హ్క్లీం, హ్సౌః,

(1) ఙం, సర్వసిద్ధిప్రదాదేవీ, (2) తం, సర్వసంపత్ప్రదా దేవీ, (3) థం, సర్వప్రియంకరీదేవీ, (4) దం, సర్వమంగళ కారిణీదేవీ, (5) ధం సర్వకామప్రదాదేవీ, (6) నం. సర్వ దుఃఖ విమోచనీదేవీ, (7) పం, సర్వమృత్యుప్రశమనీదేవీ, (8) ఫం, సర్వవిఘ్ననివారిణీదేవీ. (9) బం. సర్వాంగసుందరీ దేవీ, (10) భం, సర్వసౌభాగ్యదాయినీదేవీ, ఏకార ప్రకృతిక, దశావతారాత్మక, విష్ణుస్వరూపే; సింధూరపు రంగుకలది; దేవ్యాగ్రికోణ మారభ్య వామావర్తేన పూజ; త్రిపురాశ్రీ చక్రేశ్వరీ; సంప్రదాయయోగినులు, సర్వోన్మాదనీముద్ర

<u>6. చతుర్దశారచక్రము</u> (సర్వసౌభాగ్యప్రదాయక చక్రము) హ్రైం హ్క్లీం. హ్సౌః :.

(1) కం. సర్వసంక్షోభిణీశక్తి; (2) ఖం. సర్వవిద్రావిణీ శక్తి; (3) గం, సర్వాకర్షిణీశక్తి; (4) ఘం, సర్వాహ్లాదినీశక్తి; (5) ఙం. సర్వసమ్మోహినీశక్తి; (6) చం. సర్వస్తంభినీశక్తి;

(7) ఛం. సర్వవిజృంభిణీశక్తి, (8) జం. సర్వవశంకరీశక్తి, (9) ఝం. సర్వరంజనీశక్తి, (10) ఞ. సర్వోన్మాదినీశక్తి, (11) టం. సర్వార్థసాధినీశక్తి, (12) ఠం సర్వసంపత్తిపూరణీ శక్తి. (13) డం. సర్వమంత్రమయీశక్తి. (14) ఢం. సర్వ ద్వంద్వక్షయంకరీశక్తి. ఈకారప్రకృతికము. చతుర్దశ భువ నాత్మకం, మహామాయామూర్త్యైరూపే. దేవ్యగ్రికోణమారభ్య వామావర్తేన పూజ. త్రిపురవాసినీ చక్రేశ్వరీ, సంప్రదాయయోగినీ సర్వవశంకరీముద్రా, భయ స్థాయీ భావము; భయానక రసాత్మ కము; దానిమ్మపువ్వురంగు. మందారపువ్వు రంగుకంటె కొంచెము తక్కువ ఎరుపురంగు).

*7. అష్టదలపద్మ చక్రము* (సర్వసంక్షోభణచక్రము): హ్రీం, క్లీం, సౌః.

(1) కం....ఙం అనంగకుసుమాదేవీ, (2) చం....ఞం, అనంగమేఖలాదేవీ, (3) టం .... ణం, అనంగమదనాదేవీ, (4) తం ...నం, అనంగమదనాతురేదేవీ. (5) పం....మం, అనంగరేఖాదేవీ, (6) యం ...వం, అనంగవేగినీదేవీ. (7) శం... హం, అనంగాంకుశాదేవీ, (8) ళం క్షం; అనంగమాలినీ దేవీ; హకారప్రకృతిక; అష్టమూర్త్యాత్మక; శివాత్మిన్నే; గుప్తతర యోగినీ; త్రిపురసుందరీ చక్రేశ్వరీ; పృష్ఠదల మారభ్య, పూర్వాది దిక్షు, ఆగ్నేయాదివిదిక్షు, క్రమేణ [ప్రాదక్షిణ్యేన] పూజ; శోక భావము; కరుణారసాత్మకము; జపాకుసుమపురంగు.

*8. షోడశదళపద్మ చక్రము* (సర్వాశాపరిపూరక చక్రము)

ఓం, క్లీం, సౌః,

(1) అం, కామాకర్షిణీ నిత్యాకలాదేవీ, (2) ఆం, బుద్ధ్యాకర్షణీ నిత్యాకలాదేవీ... , (3) ఇం, అహంకారాకర్షిణీ .... (4) ఈం, శబ్దాకర్షిణీ... , (5) ఉం, స్పర్శాకర్షిణీ..... (6) ఊం, రూపాకర్షిణీ .. , (7) ఋం, రసాకర్షిణీ....., (8) ౠం....గంధాకర్షణీ....., (9) ఌం, చిత్తాకర్షిణీ . (10) ౡం, ధైర్యాకర్షిణీ ... (11) ఏం, స్మృత్యాకర్షిణీ...., (12) ఐం, నామాకర్షిణీ... , (13) ఓం, బీజాకర్షిణీ...., (14) ఔం, ఆత్మాకర్షిణీ...., (15) అం, అమృతాకర్షిణీ..... (16) అః, శరీరాకర్షిణీ నిత్యా కలాదేవీ, దేవ్యాగ్రదలమారభ్య వామావర్తేన పూజ, నకార ప్రకృతిక; షోడశకళాత్మకే; చంద్రస్వరూపే; త్రిపురేశీ చక్రేశ్వరీ; సర్వవిద్రావిణీముద్రా; తెలుపురంగు, గుప్తయోగినీ, ఉత్సాహం స్థాయీభావము, వీరరసాత్మకము.

## వృత్తత్రయము.

*9. ధరణీ సదనత్రయము వేక భూపురచక్రము* (త్రైలోక్య మోహన చక్రము) అం ఆం సౌః.

(iii) తృతీయరేఖాయాం (1) ద్రాం, సర్వసంక్షోభిణీ, ముద్రాశక్తి, (2) ద్రీం, సర్వవిద్రావిణీ, (3) క్లీం, సర్వాకర్షిణీ (4) బ్లూం, సర్వవశంకరీ, (5) సః, సర్వోన్మాదినీ, (6) క్రోం,

సర్వమహాంకుశా; (7) హ్స్ఖ్ఫ్రేంహ్సౌః సర్వఖేచరీ, (8) హ్సౌః సర్వబీజ, (9) ఐం సర్వయోని; (10) హ్సైం హ్స్క్లీం హ్సౌః సర్వత్రిఖండాముద్రాశక్తి; పసుపురంగు; (ii) ద్వితీయ, వేక, మధ్య రేఖాయాం. (1) అం బ్రాహ్మీ మాతృకాదేవీ; (2) ఈం మాహేశ్వరీ; (3) ఊం కౌమారీ. (4) ఋూం వైష్ణవీ; (5) ౡం వారాహీ; (6) ఐం. మాహేంద్రీ (ఇంద్రాణీ); (7) ఔం. చాముండా; (8) అః మహాలక్ష్మీ మాతృకాదేవీ; ఉదయించు సూర్యుని రంగు.

(i) ప్రథమరేఖాయాం, (1) అం అణిమాసిద్ధిదేవీ; (2) లం లఘిమాసిద్ధిదేవీ; (3) మం. మహిమాసిద్ధిదేవీ; (4) ఈం ఈశత్వ సిద్ధిదేవీ; (5) వం వశిత్వసిద్ధిదేవీ; (6) పం ప్రాకామ్యసిద్ధిదేవీ; (7) భుం భుక్తిసిద్ధిదేవీ; (8) ఇం ఇచ్ఛా, సిద్ధిదేవీ; (9) పం ప్రాప్తిసిద్ధిదేవీ; (10) సం. సర్వకామ సిద్ధి దేవీ; శుక్ల వర్ణము.

లకార ప్రకృతిక పృథివ్యాత్మకస్య, పశ్చిమాది దిక్షు వాయవ్య కోణేషువా చ, పశ్చిమ-నైఋతియాం, పూర్వ-ఈశాన్య యోశ్చ మధ్యే క్రమేణపూజా; త్రిపురా చక్రేశ్వరీ; ప్రకట యోగినిలు; రతిభావము; శృంగారరసాత్మకము.

కొంతరు గ్రంథకారులు, నవగ్రహములను. దశావతారము లను గూడ. శ్రీచక్రములోని తొమ్మిది చక్రములతోను జేర్చుచు న్నారు. ఇది ఎంతవరకు ఔచిత్యమో చెప్పజాలము.

1974 వ సంవత్సరంలో అప్పటి రైల్వేమంత్రి మాననీయ శ్రీ లలితనారాయణమిశ్ర గారిచే యివ్వంబడిన మొదటి తరగతి ఫ్రీపాసు (1st class free pass) ( ఈ free pass జనతా గవర్నమెంటు కాలమున 1977 లో రద్దు చేయబడినది) సహాయ్యమున భారతదేశమునంతటను మూడుసంవత్సరములు తీర్థాటనము చేసి— కన్యాకుమారి మొదలు కాశ్మీరము వరకును, ద్వారక మొదలు కామరూపము వరకును—పర్యటనముచేసి తెలిసినంతవరకు 180 వివిధ ప్రస్తారముల శ్రీచక్రములను పరిశీలించితిమి. ఆ పరిశీలనా ఫలస్వరూపముగ 40 విధములగు తప్పులు (flaws) కానవచ్చినవి. 72 ప్రశ్నలు, సందేహములు వచ్చినవి. వాటి నన్నిటిని దిద్ది ప్రస్తుతము ప్రతిష్ఠ చేసిన శ్రీ చక్రమేరువును (2, 200 కిలోగ్రాముల బరువుగలది) 3'×3'×3' సాలిగ్రామశిల (Black granite) పై ఆంధ్రస్థపతులచే హైదరాబాదులో తయారుచేయించబడినది. ఇది దేశములోని కెల్ల పెద్ద మేరుచక్రము. భారతదేశములోని కెల్ల ఏకైక శ్రీచక్రమేరు దేవాలయము

విగ్రహము దేవతయొక్క కల్పిత బాహ్యస్వరూపమును చిత్రించును, యంత్రమన్ననో ఆయాదేవతలయొక్క ప్రతీకము. దాని తత్త్వమును సూచించును. అందుచే దేవతా విగ్రహము యొక్క పూజ కంటె, దాని యంత్రము యొక్క పూజ విశిష్టమని విబుధుల మతము. ఆ కారణముచేతనే, ఏదేని దేవతావిగ్రహమును ప్రతిష్ఠచేయునపుడు, దానిక్రింద దాని తత్త్వమును తెలుపుయంత్రమును స్థాపింతురు.

శ్రీచక్రము, శ్రీ లలితామహాత్రిపురసుందరీ రాజరాజేశ్వరీ పరాభట్టారిక యొక్కయంత్రము. మహాత్రిపురసుందరీ అనగా, అవాఙ్మానసగోచరుడగు పరబ్రహ్మ తత్త్వమును, తంత్రశాస్త్రమున శాస్త్రజ్ఞులు మాతృరూపమున జగన్మాత, జగదంబ, శ్రీ లలితా మహాత్రిపురసుందరీ–రాజరాజేశ్వరీ యని నిర్వచించిరి. అది లేక. ఆమె ప్రణవస్వరూపము. యంత్రములకోనికెల్ల మేటి యగుటచే దీనికి యంత్రరాజము, లేక, శ్రీచక్రము అని పేరు. శ్రీచక్రము సమస్త విశ్వమునకును (అనంతకోటి బ్రహ్మాండములకును Macrocosm), పిండాండమునకును, (Microcosm) పరబ్రహ్మమునకును కూడాను ప్రతీకము. అందుచే శ్రీచక్రమును సర్వవర్ణములవారును. సర్వ ఆశ్రమముల వారును, స్త్రీలును, పురుషులును, జ్ఞానులును, అజ్ఞానులును, అనగా సర్వజనులును, సర్వకాలములయందును పూజింపనగును, "ఆబాలగోపవిదిత" లలితా సహస్రనామము, 995.

శ్రీచక్రము బీజాక్షర విన్యాసశూన్యమైనది. అనగా, ఈ యంత్రమున బీజాక్షరములు వ్రాయబడవు. ఏలనన, అన్ని అక్షరములు, శబ్దములు, గూడ దీనినుండియే పుట్టినవి గనుక. ఇందు పైన వివరించిన రీతిని తొమ్మిది చక్రములు గలవు. ఇది త్రిఖండాత్మకమైనది; అనగా 1, 2, 3. చక్రములు కలిసి అగ్నిఖండము—సృష్టి: 4, 5, 6. చక్రములు కలిసి సూర్యఖండము–

స్థితి 7, 8, 9, చక్రములు కలిసి చంద్రఖండము — లయము, లేక సంహారము. క్రింది నుండి పైకి పూజచేయునపుడు, ఈ చక్రములనే ఆవరణలని పిలుతురు. అట్టి పూజనే "నవావరణ పూజ" అని పిలుతురు.

మహాత్రిపురసుందరీ యొక్క మంత్రము మూడు అంతర ములు గలది—బాల (ఐం క్లీం సౌః). త్ర్యక్షరి: పంచదశాక్షరీ— క ఏ ఈలహ్రీం, హసకహలహ్రీం, సకలహ్రీం. దీనిని మూల మని కూడ వ్యవహరింతురు షోడశాక్షరీ శ్రీం హ్రీం క్లీం ఐం సౌః ఓంహ్రీంశ్రీం, కఏఈలహ్రీం, హసకహల హ్రీం, సకలహ్రీం, సౌః ఐం క్లీం హ్రీం శ్రీం. ఇందు, మొత్తము లెక్కించినచో అక్షర ములు 28 ఉన్నవి; గనుక దీనిని *అష్టవింశత్యాక్షరీ*, అని కూడ వ్యవహరింతురు. *షోడశాక్షరీ*, లేక *షోఢా* అనునపుడు మూల మంత్రములోని మూడు కూటముల (groups)ను మూడు అక్షరము లుగ పరిగణింతురు.

శ్రీ చక్రమును లలితాసహస్రనామములతోను, మంత్రగర్భి తమైన త్రిశతి. సౌభాగ్య అష్టోత్తర శతనామావళితోను, అష్టోత్తర శతనామావళితోను, దేవీ ఖడ్గమాలా స్తోత్రముతోను, పురుషసూక్త శ్రీసూక్తములతోను విశేషించి, శుక్రవారము అష్టమి, పూర్ణిమా, తిథులయందును, శ్రీ చక్రార్చన చేయుదురు. శ్రీ చక్రార్చనమున, పసుపుతో చేసిన కుంకుమను, అట్టి కుంకుమతో చేయబడిన ఎఱ్ఱ అక్షతలను, ఎఱుపు పుష్పములను, బిల్వదళములను, తులసీదళముల నుపయోగించెదరు.

మూలాధారచక్ర అధిష్ఠాత్రిగ ముద్గలాన్నమును (పెసర పప్పు అన్నమును), (520) లలితా సహస్రనామము, స్వాధిష్ఠాన చక్ర అధిష్ఠాత్రిగదధ్యన్నమును (పెరుగు అన్నమును) (518), మణిపూరక చక్ర అధిష్ఠాత్రిగ గుడాన్నమును (బెల్లపు అన్నమును) (502), అనాహత చక్ర అధిష్ఠాత్రిగ స్నిగ్ధాన్నమును (నేతి అన్నమును) (493), విశుద్ధ చక్ర అధిష్ఠాత్రిగ పాయసాన్నమును (పరమాన్నము) (481), ఆజ్ఞాచక్ర అధిష్ఠాత్రిగ హారిద్రాన్నమును (పసుపు అన్నమును – పులిహోర) (527), సహస్రదల చక్ర అధిష్ఠాత్రిగ సర్వోదనమును (అన్నీ కలపిన అన్నమును) (534) లలితాసహస్రనామమున పేర్కొనబడినవి. కాని కొందరుఆమ్లాన్నమును (చింతపండు అన్నమును), మరి కొందరు తిలాన్నమును (నూపప్పు అన్నమును) నివేదన చేతురు. వీటికెక్కడను ప్రమాణము కానరాలేదు.

ప్రస్తుతము, శ్రీ చక్రార్చనమునందు ఉపయోగించు "లలితా సహస్రనామ స్తోత్రరత్నము," బ్రహ్మాండ పురాణము యొక్క ఉత్తరాఖండములో చివరనున్న లలితోపాఖ్యానము లోనిది. లలితోపాఖ్యానము కూడ బ్రహ్మాండ పురాణమున ప్రక్షిప్తము చేయబడినదని విశేష జ్ఞుల యొక్కయు విమర్శకాయుల యొక్కయు అభిప్రాయము. అందుచే ఇది తంత్రములకు సంబంధించినదికాదు; కేవలము పౌరాణికము, తంత్రశాస్త్రమున "దశమహావిద్యలు" అను గ్రంథమునందున్న "షోడశీ" – మహాత్రిపురసుందరీ మహా

విద్యలో" విధించబడిన లలితాసహస్రనామము వేరు. పౌరాణికపు, లలితా సహస్రనామస్తోత్రములను తాంత్రికపు శ్రీ విద్యాసపర్యా పుస్తకము లోనికెప్పుడు ఏలా ఎవరిచే దూర్చబడినదో చెప్పజాలము. శ్రీ విద్యోపాసక విశేషజ్ఞులు ఈ తారుమారును ఏలకనుగొనలేరిదియు చెప్పజాలము కాని తూష్ణీభావము మాకాశ్చర్యమును మాత్రము గొలుపుచున్నది. తాంత్రికపు శ్రీ విద్యయందు పౌరాణికపు సహస్రనామ మెట్లు చొప్పింపబడినదియు చెప్పలేకున్నాము. కాని, ఇది సక్రమము కాదని గట్టిగా చెప్పగలము.

శ్రీ చక్రము మూడు [illegible] లేక, మూడు విధములుగ నిర్మాణము చేయబడును

1 భూప్రస్తా [illegible] రేఖాయుతమైనది, అనగా, ఫొటో వలె పొడవు, వెడల్పు మాత్రము గలిగినది.

2. కూర్మపృష్ఠము—ఇందు నావురముపైన, మిగిలిన ఎనిమిది చక్రములు, ఒకదానిపై నొకటి, కొంచెము ఉబికి, లేక లేచియుండును.



కూర్మపృష్ఠ శ్రీ చక్రము, తప్పుది తెరచిన గుమ్మటములు గలది.

3. మేరు ప్రస్తారము:—ఇందు చక్రములు ఒక దానిపై మరియొకటి లేచి, పర్వతము లేక, మేరువువలె ఎత్తుగా నుండును—పొడవు, వెడల్పు, ఎత్తు సరిసమానముగా నుండును. వీటికన్నిటికిని నిశ్చితములగు కొలతలు శ్రీ చక్ర నిర్మాణ విధానమున విపులముగ చెప్పబడినవి. శ్రీచక్రము ౧. భూర్జపత్రము (హిమాలయమున ఏడు వేల అడుగుల ఎత్తుపైబడి 14 వేల అడుగుల ఎత్తువరకు పర్వతములలో పెరుగు భూర్జవృక్షము యొక్క కాగితము వంటి పట్ట) మీద వ్రాసి, రక్షరేకులలో ఉంచి ధరింతురు. ధాతువులతో చేసిన చిన్న చక్రములను మెడలో రక్షరేకులుగ ధరింతురు. శ్రీచక్రము రాగి, వెండి, బంగారము, పంచలోహములతో గాని

చేసిన రేఖలపై బీజాక్షరములు లోతుగ చెక్కబడిగాని (అధోముఖ రేఖలు engraved), నాణెములపైన పొక్కి పైకిలేచిగాని (ఊర్ధ్వ ముఖ రేఖలు embossed) గాని చేయబడును, రాతిమీదగాని, స్ఫటికము, పచ్చ, మొదలగు మూల్యములగు రాళ్ళమీద (precious stones) గాని చెక్కుదురు. మేరుచక్రములను పంచధాతువులతో పోతపోయుదురు తమ, తమ మనఃసంతృప్తికి, వెండి, బంగారములతో చేసినప్పటికిని, శ్రీచక్రము, భూప్రస్తారము అయినప్పటికిని సరే, మేరువైననుసరే, రాగి దైననూసరే, బంగారముతో చేసినది అయిననూసరే, చిన్నది అయిననూ, లేక పెద్దది అయిననూసరే పూజాఫలము ఒక్కటే, భేదములేదు. శ్రీచక్రము పరమదయాళు వగు పరబ్రహ్మమునకు ప్రతీకముగాన ఇది, యంత్రములలోని కెల్ల అతిసౌమ్యమైన యంత్రము; గనుకనే, శ్రీశైలములోని భ్రమరాంబికా, కంచిలోని కామాక్షి, విజయవాడలోని కనకదుర్గ, జంబుకేశ్వరములోని అఖిలాండేశ్వరీ మొదలగు క్షేత్రములలోని ఉగ్రపీఠముల యొక్క ఉగ్రతను నివారించుటకై ఆదిశంకరులు, ఆయా చోటులలో శ్రీచక్రములను ప్రతిష్ఠాపన చేసిరని ప్రతీతి, అందుచే కొందరు అజ్ఞానులు శ్రీచక్రము ఉగ్రమైనదని భయపెట్టు వారి మాటలు కేవలము తప్పు, సత్యదూరములునై యున్నవి. తల్లి దగ్గర కుమారునికి భయమేటికి ?

శ్రీచక్రము పెద్దదయినచో అది ఉగ్రమైనదని తలంచు అజ్ఞుల మూఢ విశ్వాసమునకు ఆధారము లేదు.



కాశీలో అన్నపూర్ణ దేవాలయములోనికి ప్రవేశించగనె కుడి ప్రక్కన ఒక గోతిలో శివలింగముపై భూప్రస్తార చక్రము చెక్కబడి యున్నది.

దీనిని మూర్తి శాస్త్ర పరిభాషలో యంత్రలింగ మందురు. ఇది శిల్పి యొక్క నైపుణ్య చాతుర్యమే కాని ఇది ఎంతమేరకు పూజనీయమో చెప్పజాలము.

శివలింగముపైన, భూప్రస్తార శ్రీచక్రమును ఊర్ధ్వ రేఖ లతో చెక్కుట కొన్ని చోట్ల చూచితిమి. దీనిని మూర్తి శాస్త్ర

విశేషజ్ఞులు (Iconography Specialists) Archaeologits వారి పరిభాషలో యంత్రలింగమందురు ఇట్టి యంత్రలింగముల నాల్గింటిని కాశీనగరమునను, ఒక దానిని అక్స్ఫో మ్యూజియము లోను చూచితిమి. ఇదిగాక అర్థగోళపు స్ఫటికముపై చెక్కిన ఒక భూప్రస్తార చక్రమును జయపూరు పురాతత్త్వమేన్యుస్క్రిప్ట లైబ్రరీలో (Manuacript Library) ను, కాశీలో ఒక వృత్తాకారంగు స్ఫటికముమీద చెక్కిన దానిని గూడ జూచితిమి. ఇవి కలాత్మక వస్తువులు అయినప్పటికిని, ఇట్టి యంత్రములు మేరువనిగాని భూప్రస్తారపువనిగాని చెప్పుటకు వీలులేదు. అందుచే ఇట్టి యంత్రములు పూజ చేయుటకు ఎంత యోగ్యమైనవియు చెప్పుట కష్టము.

దివ్య శక్తులన్నిటిని మూర్తీభవించిన దేవతలుగ వర్ణించు ఆచారము మన శాస్త్రములలో కలదు. శబ్దాత్మకము, స్పందనాత్మకమునైన మంత్రము దేవతలకు సూక్ష్మశరీరము. యంత్రము స్థూల శరీరము, మూర్తి, ప్రతిమ లేక, విగ్రహము, రూప ప్రధానాత్మకమైనది. అది దేవతలకు రూపమును కల్పించి అట్లున్నట్లు భావింపచేయబడుచున్నది. యంత్రమన్ననో దేవతల యొక్క మంత్రము యొక్కయు, యంత్రము యొక్కయు సంబంధమును విశదీకరించి తద్వారమున ఐహిక సుఖమును పారమార్థిక మోక్షమును చేకూర్చును.

"మననాత్, త్రాయత ఇతి మంత్రః'' మననము వలన తరింపచేయునది మంత్రము, మంత్రము, అనగా బీజాక్షరములని

చెప్పబడు కొన్ని అక్షరములయొక్క విశిష్ట సమూదాయము. ఏదేని బీజము తగిన క్షేత్రమున నాటబడి పోషణ చేయబడిన ప్పుడు పెరిగి పెద్ద వృక్షమై ఎట్లు ఫలము నిచ్చునో అట్లే మంత్రములోని బీజాక్షరములను జపించుటచే గొప్ప స్పందనయు తద్వారమున గొప్ప శక్తి, సాధకునిలో ఉత్పన్నమై, సాధకుని, భౌతికమైనట్టియు, ఆధ్యాత్మిక సంబంధమైనట్టియు, శ్రేయస్సును, తుదకు మోక్షమును చేకూర్చును,



శ్రీచక్రమే మవు తప్పాది.

ఇందు భూపురముయొక్క మూడు రేఖలు మెట్లవలె చూప బడినవి. దళములు అరసున్న ఎమ్మలవలె చూపబడినవి. వృత్త

త్రయము పూర్తిగా వదలివేయబడినది. ఇట్టి పద్ధతము యొక్క ప్రచారము విశేషించి తెనాలి, గుంటూరు ప్రాంతములలో శ్రీకల్యాణానంద భారతీ స్వామివారి అనుయాయులు వాడుచున్నారు.

విశ్వసృష్టికి ప్రారంభమున పరబ్రహ్మమునందు "ఏకోహం బహుస్యాం ప్రజాయేయ" అను 'కామకల' సుసూక్ష్మమైన సంకల్పముచే ఉత్పన్నమైన ప్రథమ స్పందన 'ప్రణవము' లేక, ఓంకారము (మా గాయత్రీ మంత్రార్థ ప్రదీపికలో [illegible] ని గీతా భాష్యమునందు గాని చూడవలెను.) అటువంటి ప్రణవమును జపించుటకును, శ్రీచక్రార్చన చేయుటకును మనుష్యులందరికిని హక్కు కలదు

చెప్పబడినట్టియు, పడనట్టియు, శ్రీవిద్యాసపర్యా పుస్తకములలో గురుమండల పూజ, త్రికోణ చక్రమునకు పైభాగమున యున్న చతుష్కోణము నందు (Trapezium) లోను చూపబడి యున్నది. మరికొన్ని సపర్యా పుస్తకములలో బిందువు పై చెప్పబడిన చతుష్కోణమున చూపబడినది. ఇది చాలా శాస్త్రవిరుద్ధమైన పని. ఏలయన, పై చెప్పబడిన చతుష్కోణము వాస్తవమున శ్రీచక్రమునందు ఉండక, బయట యున్నది. అలాగుననే, అష్టమావరణలో ప్రారంభమున చెప్పబడిన ఆయుధపూజ కూడ సరికాదు.



చెన్నపట్టణమునకు 15 మైళ్ళ దూరమున మాంగాడు (ఆమ్రారణ్యము) అనుచోట, సిమెంటుతో చేసిన ఒక అర్ధమేరు-కూర్మపృష్ఠ శ్రీచక్రమునకు ప్రత్యేకపు ఏకైక పురాతన దేవాలయము గలదు. నాలుగు ప్రక్కల గండ్లు కొట్టిన గుమ్మములు గలవు. ఇది చాల తప్పులతో ఉన్నది. ఇది చాళుక్యుల కాలమునాటిదని చెప్పుదురు. భూపుర రేఖలు మెట్లవలె ఒకదానిపై ఒకటి లేచి ఉన్నవి. ఈ యంత్రము అంతయు ఒక కూర్మముపైన పెట్టబడి ఉన్నది. 6' × 6' × 3' పరిమాణము గలిగి, బిందువు చిన్న నిమ్మకాయంత ఉన్నది.

బిందువు మధ్యకోణము యొక్క మూడు భుజములను తాకుచున్నట్లు చూపవలయును. ఇక్కడ బిందువు అనగా కేవలము

ఓ చుక్క. (Point ".") కాదు. పరబ్రహ్మమునందు "ఏకోహం స్యాం ప్రజాయేయ" అను సంకల్పము (కామకల) అను స్థితిని బిందువు నిర్దేశించును.

దేశములోని శ్రీచక్ర మేరువులలో నూటికి 99 చక్రములలో భూపుర రేఖలు, మూడును ఒకదానిపై ఒకటి మెట్లవలెను, వృత్తత్రయ రేఖలు మూడును ఒకదానిపై ఒకటి గుండటి మెట్ల వలె చూపబడుచున్నవి. ఇది కేవలము తప్పు. భూపురమునకు నాలుగువైపుల $3 \times 4 = 12$ ద్వారములు తెరచిగాని, మూసిగాని చూపబడినవి. అదియు చాలా తప్పు. ఏలనన శ్రీచక్రము అనంతమగు బ్రహ్మాండమునకును, బ్రహ్మమునకును ప్రతీకము, అందుచే, దానినుండి బయటకు పోవుట అను ప్రసక్తియే లేదు. అదిగాక, మొదటి రచయితలపు, ఉద్ధారశ్లోకమునందును, సౌందర్యలహరి యందలి ఉద్ధారశ్లోకమునందును, ద్వారముల ప్రసక్తియేలేదు. అది తంత్రముల తరువాత వెలసిన గ్రంథములలో, తక్కువ పరిజ్ఞానము గలవారును, శంకరులకు ఆరు ఏడు వందల సంవత్సరముల తరువాత లక్ష్మీధరుడు, బిడియము లేకుండ, తన సౌందర్యలహరి భాష్యములో మూల ఉద్ధార శ్లోకమున చతుర్ద్వారములను దూర్చి ప్రక్షిప్తము చేసెను, (Interpolated) ద్వారముల కెక్కడను కొలతలివ్వబడలేదు. 11 ఉపనిషత్తుల కతిరిక్తములయిన పన్నియు శంకరుల తరువాత వ్రాయబడి ఉపనిషత్తులలో చేర్పబడినవి. అందుకు ప్రమాణములు చాలగలవు.

ఆది శంకరుల పరమ గురువులగు శ్రీ గౌడపాదాచార్యుల కృతియని చెప్పబడు సుభగోదయస్తుతి, 52 శ్లోకీయ పుస్తకము నందును, పుణ్యానంద నాథుని "కామకలావిలాసమను" గ్రంథమునందును, వృత్తత్రియమును, శ్రీచక్రములోని ఒక చక్రముగ వర్ణింపబడిన నిరూపణ సరిగాదని మా దృఢ నమ్మకము

ఆదిశంకరుల రచనయని చెప్పబడు సౌందర్యలహరిలోని 11వ శ్లోకమున చక్రోద్ధారము, అపూర్ణముగను, అనిశ్చితము (Incomplete and Indefinite) గను వర్ణింపబడినది. 9, 14 శ్లోకములలో జలమునకు శరీరమునందలి మణిపూర చక్రమును జలము అధిష్ఠానముగ చెప్పి, దానిని రెండవ చక్రముగను, శరీరమునందలి స్వాధిష్ఠాన చక్రమును అగ్ని కధిష్ఠానముగ చెప్పి, దానిని మూడవ చక్రముగను వర్ణింపబడినది, తంత్ర శాస్త్రమున షట్చక్రముల వర్ణన వచ్చిన చోట్లలోను హఠయోగ ప్రదీపిక, ఘేరండ సంహిత మొదలగు యోగసంబంధమైన గ్రంథముల న్నిటిలోను స్వాధిష్ఠానము ఆపోతత్త్వము కధిష్ఠానమగు రెండవ చక్రముగను, అగ్ని తత్త్వమున కధిష్ఠానమగు మణిపూర చక్రము, మూడవ చక్రముగను వర్ణింపబడినది. సౌందర్య లహరి పేరు, శంకరుల అన్యకృతులలోను, శంకరుల అన్యకృతు లను సౌందర్యలహరిలోనుగాని ఉదహరింపబడలేదు. శరీరములో ముఖ్యనాడులు ఇడా, పింగలా, సుసుమ్నా, కుండలిని సౌందర్య

లహరిలో ఉదహరింపబడలేదు. శంకరుల కాలమున ప్రచారములో కాక, రెండు, మూడు శతాబ్దముల తరువాత ప్రచారములోనికి వచ్చిన నవరసములు, నాసాధారణము, సౌందర్యలహరిలో చెప్పబడినవి పైచెప్పబడినట్టియు, ఇకను కొన్ని లోపములు ఉండుట చేతను సౌందర్యలహరి ఆదిశంకరులవి కాదని చెప్పుటకు సాహసించు చున్నాము. అంత మాత్రము చేత దాని సాహిత్యపు గొప్పతనమునకు లోటురాదు.



శ్రీచక్రమేరువు తప్పుది, ద్వారాలున్నాయి పద్మదళాలు ప్రాకెట్టు దిమ్మలలా ఉన్నాయి. భూపుర రేఖలు మెట్లవలె చేయబడినవి.

ఐదు కోణముల ముందుగను (మేరువులో యెదుటగను), నాలుగు కోణముల పైకిని (మేరువులో వెనుకను) ఉండులాగున శ్రీచక్రమును పశ్చిమాభిముఖముగ ఉంచి, అర్చన చేయువాడు,

చక్రమునకభిముఖముగ తూర్పుగ కూర్చుని, అర్చన చేయవ లెను. శ్రీచక్రమునకు గాని మరి ఏ ఇతర దేవతకు గాని ఒక ప్రక్కన నిలువబడి అర్చన చేయు ఆచారము చాల తప్పు.

కాని సమష్టి పూజ చేసికొనునపుడు ప్రధానముగ చేయు వారు తప్ప మిగిలినవారందరును గుండ్రముగ శ్రీచక్రము చుట్టును ఏదిశగనైన కూర్చుండవచ్చును.

శ్రీచక్రములోని యోగినులు, మహాత్రిపుర సుందరి నుండి వెలువడిన మయూఖలు, లేక కిరణములు శక్తులు, ప్రతియొక్క ఆవరణలోని దేవతలు మొత్తము కలిసి సామూహికముగ క్కఒక్క ప్రత్యేకపు పేరున బరగుచున్నవి. 1. ప్రకట 2. గుప్త 3. గుప్తతర 4. సంప్రదాయ 5. కులోత్తీర్ణ 6. నిగర్భ 7. రహస్య 8. అతిరహస్య 9. పరాపరాతిరహస్య యోగిని.

1. బిందు చక్రము, బాలార్కసూర్యునివలె కరగిన బంగా రపు ఎరుపురంగు కలిగియున్నది. 2. త్రికోణము బంధూక పుష్పము (మందారపువ్వువలె గాఢమైన ఎరుపురంగు కలది). 3. అష్టారము పద్మరాగము లేక తెలికయగు గులాబీరంగు కలిగి యున్నది. 4. అంతర్దశారము జపాకుసుమము (మందారపువ్వు) వలె గాఢమైన ఎరుపురంగు కలిగియున్నది. 5. బహిర్దశారము, సింధూరపు (నారింజపండు) రంగు కలిగియున్నది. 6. చతుర్దశా రము దాడిమీ కుసుమము (దానిమ్మపువ్వు రంగు) కలిగియున్నది. గాఢమైన ఎరుపుకంటె కొంచెము తక్కువ ఎరుపు 7. అష్టదల పద్మము జపాకుసుమపు రంగు కలది. 8. షోడశదల పద్మము శుక్లవర్ణము కలది. 9. భూపుర చక్రము పసుపురంగు కలది. భూపుర రేఖలు, లోపనుంచి బయటకు వరుసగా పసుపు, అరుణ

(ఉదయపు సూర్యునియొక్క రంగు) కరిగిన బంగారపు రంగు కలది మూడవరేఖ తెలుపురంగు కలిగియున్నది. చక్రేశ్వరి యొక్క పూజ, చక్రములయొక్క అగ్రభాగమున (ముందు భాగమున) చేయవలెను.



పంచధాతువులతో చేసిన 25 కిలోల శ్రీ చక్రమేరువు ఒకటి యేనుగుమహల్ శ్రీనగరంలోను ఇంకొకటి కర్ణప్రయాగ దగ్గఱ ఉన్న నౌటి గ్రామములో ఉన్నది, ఇందు భూపురరేఖలు వృత్తయము మెట్లవలె ఒక దానిపై ఒకటి చేయబడినవి. ఇది తప్పుది. రెండు చక్రములలో ఈ మేరు త్రికోణ పద్మ చక్రముల (సూర్య చంద్ర ఖండము) లను విడదీయుచు ఒక పటకా నిర్మింపబడినది.

శ్రీ గౌడపాదాచార్యుల వారి శిష్యులు గోవింద భగవత్పాదులును, ఆదిశంకరులును, వారినలుగురు ప్రధాన శిష్యులు— సురేశ్వరాచార్యులు, పద్మపాదులు, హస్తామలకాచార్యులు, త్రోటకాచార్యులు, కామకోటి పీఠాధిపతులు, గొప్ప శ్రీవిద్యోపాసకులుగా పరిగణింపబడిన వారికి దీక్షానామమని చెప్పబడు నాథనామములు కానరావు. వారి కృతులలో వారి నాథనామములను పేర్కొనలేదు. కొంతమంది శ్రీవిద్యోపాసకులు వారి గృహస్థనామములను చేకూర్చుకొందురు. వారిలో కొందరు గృహస్థనామములను త్యజించి దీక్షానామములను మాత్రమే ఉంచి వారికృతులలో వాటినే ఉదహరించిరి. బహుశః వారు సన్యాసులై ఉందురు. వివిధ సంప్రదాయములవారు, వారి గురుమండల ఔఘత్రయమును సృష్టించుకొనిరి. శృంగేరీశంకర పీఠమును 14వ శతాబ్దపు అంతమున పీఠమునధిష్ఠించి విఖ్యాతులైన విద్యారణ్యస్వామికి కూడా నాథనామము కానరాదు. అట్లైనచో నాథనామపద్ధతి, లేక, సంప్రదాయము విద్యారణ్యుల కాలమునకు తరువాతదై యుండుననుటకే సందేహమునులేదు. అందుచే, తథాకథితమగు నాథ దీక్షానామములు శంకరుల కాలమునకు చాల తరువాత గోరక్షనాథ సంప్రదాయపు సరణిని చేర్చబడియుండునని మా నమ్మకము.

యుగనన్నద్ధం, లేక, అర్ధనారీశ్వరం అనగా స్త్రీపురుషుల సంగమమునకంటె అతీతమగు శివశక్తుల ఐక్యత అను తత్త్వము

(Principle, Fundamental Truth) ఏదికలదో, అదే "కామకల," టిబెట్ భాషలోదీనిని "యబ్-యుమ్" (తండ్రి-తల్లి యొక్క సామరస్యము) అని అనువదించిరి. అందుచే తంత్రమనగా ఏదేని భయానకమైనట్టియు, అనియమితమైనటిదియు నగు విధాన మెద్దియుకాదు.



శ్రీచక్ర మేరువు. యేసుగుమహల్ గ్రామంలో నిర్మింపబడిన శ్రీచక్రమేరువు. తప్పులన్నియు దిద్దినది. 2. 200కిలోగ్రాముల బరువు గలది శ్రీనగరం-శ్రీచక్రాలయంలో ప్రతిష్ఠ చేయబడినది. మెరుగు బెట్టిన నల్లసాలిగ్రామ శిలమీద చెక్కబడినది.

మరియు వసంతఋతువు ప్రారంభమున చైత్రమాసము మొదటి తొమ్మిదిరోజులు, తొమ్మిదిరాత్రులు నవావరణపూజ జరిపి పదవదినమున నవావరణపూజ చేసిన తరువాత అంతమున, దేవీఖడ్గమాలా స్తోత్రములోని నామములతో హోమమును చేయుదురు. అలాగుననే శరదృతువు, ప్రారంభమున ఆశ్వయుజ మాస

మున మొదటి తొమ్మిదిరోజులు అర్చనలు చేయుదురు. శ్రీలలితా మహాత్రిపురసుందరీ యొక్క దేవీఖడ్గమాలా స్తోత్రమున శ్రీచక్రములోని దేవతలన్నియు పేర్కొనబడినవి. అందుచే నిత్య పూజోపాసన లఘువుగా చేయదలచు కొన్నవారు గూడ దేవీఖడ్గ మాలా స్తోత్రములోని నామములతో శ్రీచక్రార్చన చేసుకొందురు.

దేవీఖడ్గమాలా స్తోత్రమునందు వెయ్యి (1,000) అక్షరము లుండుటచే దీనికి సహస్రాక్షరీవిద్య అని కూడా పేరు గలదు.



శ్రీచక్రమేరువు తప్పది.

భూపురమున చూపబడవలసిన భూపుర రేఖలు, వృత్తత్రయము, మెట్లువలె ఒకదానిపై ఒకటి లేవబడి ఉన్నవి.

శ్రీచక్రార్చన సందర్భమున, హోమము చేయుట నిశ్చితముగా "విధిగా చేయవలెను" అను నియమములేదు. అనగా చేయక పోవుటచే ప్రత్యవాయములేదు. చేసిన విశిష్టఫలదాయకము.

శ్రీచక్ర విద్యోపాసనకు స్త్రీ అన్ని వర్ణములవారును అన్ని జాతులవారును అన్ని ఆశ్రమములవారు, జ్ఞానులు, అజ్ఞానులు, స్త్రీలు, శూద్రులు, శ్రీవిద్యలో దీక్షితులైనవారు, దీక్షితులు కాని వారును కూడ అర్హులు.

గౌతమీ తంత్రములోను, భాస్కరరాయలువారు వ్రాసిన సౌందర్యలహరి 11వ శ్లోకముయొక్క వ్యాఖ్యలోను స్పష్టముగ వివరించిరి.



కర్ణప్రయాగ దగ్గర నున్న నౌటి గ్రామములో నున్న తథాకథిత శ్రీచక్రము. ఇది శ్రీచక్రమేకాదు హోమగుండంలో వేసే యంత్రము, అదియు, నిలువబెట్టబడి యున్నది.

రాగితో చేయబడిన యంత్రముల మీద గాని విగ్రహము మీద గాని పంచామృతములతో అభిషేకము చేయరాదు.

శుభాగమమని చెప్పబడు వాసిష్ఠ, సనక, సనత్కుమార, శుకసంహితలను సమయాచారులు తమ ప్రామాణిక గ్రంథములుగ పరిగణింతురు.

# అనుబంధము 2

## సౌభాగ్య అష్టోత్తర శతనామావళి

కామేశ్వరీ, కామశక్తిః, కామసౌభాగ్యదాయినీ,
కామరూపా, కామకలా, కామినీ, కమలాసనా ॥౧॥

కమలా, కల్పనాహీనా, కమనీకలావతీ,
కమలాభాంతీసేవ్యా, కల్పితాశేష సంసృతిః ॥౨॥

అనుత్తరా, అనఘా, అనన్తా, అద్భుతరూపా, అనలోద్భవా,
అతిలోకచరిత్రా, అతిసుందరీ, అతిశుభప్రదా ॥౩॥

అఘహంత్రీ, అతివిస్తారా, అర్చనతుష్టా, అమితప్రభా,
ఏకరూపా, ఏకవీరా, ఏకనాథా, ఏకాన్తార్చన ప్రియా ॥౪॥

ఏకైకభావతుష్టా, ఏకరసా, ఏకాన్తజనప్రియా,
ఏధమానప్రభావా, ఏధత్, భక్తపాతకనాశినీ॥౫॥

ఏలామోదసుఖా, ఏనోద్రి–శక్రాయుధస మస్థితిః,
ఈహాశూన్యా, ఈప్సితా, ఈశాదిసేవ్యా, ఈశాన
వరాంగనా॥౬॥

ఈశ్వరాజ్ఞాపికా, ఈకారభావ్యే, ప్సితఫలప్రదా,
ఈశానేతి హరేక్షేషత్ – అరుణాక్షేశ్వరేశ్వరీ ॥౭॥
(ఈశాన్యే, ఈతిహారే, ఈక్షే, ఈషదరుణా,
ఈశ్వరేశ్వరీ)

లలితా, లలనారూపా, లయహీనా, లసత్తనుః,
లయసర్వా, లయక్షోణిః, లయకర్త్రీ, లయాత్మికా ॥౮॥

లఘిమా, లఘుమధ్యాఢ్యా, లలమానా, లఘుద్రుతా,
హయారూఢా, హతామిత్రా, హరకాన్తా, హరిస్తుతా ॥౯

హయగ్రీవేష్టదా, హాలా-ప్రియా, హర్షసముద్భవా,
హర్షణా, హల్లకాభాంగీ, హస్త్యన్తైశ్వర్యదాయినీ ॥౧౦॥

హల హస్తార్చిత ప్రదా, హవిర్దాన ప్రసాదినీ,
రామా, రామార్చితా,రాజ్ఞీ,రమ్యా,రసమయీ, రతిః ॥౧౧॥

రక్షిణీ, రమణీ, రాకా, రమణీమండలప్రియా,
రక్షితాఖిలలోకేశా, రక్షోగణ నిషూదినీ॥౧౨॥

అంబాం, త కారిణ్యంభోజ ప్రియాంతక, భయంకరీ,
అంబురూపాంబుజకరాం, బుజజాత వరప్రదా ॥౧౩॥

అంతఃపూజాప్రియాం, తస్థ-రూపిణ్యం, తర్వచోమయీ,
అంతకారాతినామాంకస్థితాం, తఃసుఖరూపిణీ ॥౧౪॥

సర్వజ్ఞా, సర్వగా, సారా, సమా, సరాసుఖా, సతీ,
సంతతిః, సంతతా, సోమా, సర్వా, సంఖ్యా,సనా, తనీ॥౧౫।

# అనుబంధము 3

## దశమహావిద్యలలోని - షోడశమహా విద్యాలోని
## లలితా సహస్రనామ స్తోత్రము

కల్యాణీ కమలా కాలీ కరాలీ కామరూపిణీ ।
కామాఖ్యా కామదా కామ్యా కామనా కామచారిణీ ॥1

కాలరాత్రి ర్మహారాత్రిః కపాలీ కాలరూపిణీ ।
కౌమారీ కరుణాముక్తిః కలికల్మషనాశినీ ॥2

కాత్యాయనీ కలాధారా కౌముదీ కమలప్రియా ।
కీర్తిదా బుద్ధిదా మేధా నీతిజ్ఞా నీతివత్సలా ॥3

మాహేశ్వరీ మహామాయా మహాతేజా మహేశ్వరీ ।
మహాజిహ్వా మహాఘోరా మహాదంష్ట్రా మహాభుజా ॥4

మహామోహాన్ధకారఘ్నీ మహామోక్షప్రదాయినీ ।
మహాదారిద్ర్యనాశా చ మహాశత్రువిమర్దినీ ॥5

మహామాయా మహావీర్యా మహాపాతక నాశినీ ।
మహామఖా మన్త్రమయీ మణిపూరకవాసినీ ॥6॥

మానసీ మానదా మాన్యా మానశ్చక్షురణేచరా ।
గణమాతా చ గాయత్రీ గణ గంధర్వ సేవితా ॥7

గిరిజా గిరిశా సాధ్వీ గిరిస్థా గిరివల్లభా ।
చన్ద్రేశ్వరీ చణ్డరూపా ప్రచణ్డా చణ్డమాలినీ ॥8

చర్వికా చర్చికాకారా చణ్డికా చారురూపిణీ ।
యజ్ఞేశ్వరీ యజ్ఞరూపా జపయజ్ఞపరాయణా ॥9
యజ్ఞమాలా యజ్ఞభోక్త్రీ యజ్ఞేశీ యజ్ఞసమ్భవా ।
సిద్ధయజ్ఞ క్రియాసిద్ధి ర్యజ్ఞాఙ్గీ యజ్ఞరక్షికా ॥10
యజ్ఞక్రియాయ యజ్ఞరూపా యజ్ఞాఙ్గీ యజ్ఞరక్షికా ।
యజ్ఞ క్రియా యజ్ఞాయయజ్ఞా యజ్ఞక్రియాలయా ॥11
జలన్ధరీ జగన్మాతా జాతవేదా జగత్ప్రియా ।
జితేన్ద్రియా జితక్రోధా జననీ జన్మదాయినీ ॥12
గఙ్గా గోదావరీ చైవ గోమతీ చ శతద్రుకా ।
ఘర్ఘరా వేదగర్భా చ రేచికా సమవాసినీ ॥13
సిన్ధుర్మన్దాకినీ క్షిప్రా యమునా చ సరస్వతీ ।
భద్రా రాగ విపాశా చ గణ్డకీ విన్ధ్యవాసినీ ॥14
నర్మదా సిన్ధు కావేరీ వేత్రవత్యాను కౌశికీ ।
మహేన్ద్రతనయా చైవ అహల్యా చర్మకావతీ ॥15
అయోధ్యా మథురా మాయా కాశీ కాఞ్చీ అవన్తికా ।
పురీ ద్వారావతీ తీర్థా । మహాకిల్బిషనాశినీ ॥16
పద్మినీ పద్మమధ్యస్థా పద్మకిఞ్జల్క వాసినీ ।
పద్మవక్త్రా చకోరాక్షీ పద్మస్థా పద్మసమ్భవా ॥17
హ్రీఙ్కారీ కుణ్డలీ ధారీ హృత్పద్మస్థా సులోచనా ।
శ్రీఙ్కారీ భూషణా లక్ష్మీః క్లీఙ్కారీ క్లేశనాశినీ ॥18

హరివక్త్రోద్భవా శాన్తా హరివక్త్రకృతాలయా ।
హరివక్త్రోద్భవా శాన్తా హరివక్షస్థలస్థితా ॥19

వైష్ణవీ విష్ణురూపా చ విష్ణుమాతృస్వరూపిణీ ।
విష్ణుమాయా విశాలాక్షీ విశాలనయనోజ్జ్వలా ॥20

విశ్వేశ్వరీ చ విశ్వాత్మా విశ్వేశీ విశ్వరూపిణీ ।
విశ్వేశ్వరీ శివారాధ్య శివనాథా శివప్రియా ॥21

శివమాతా శివాఖ్యా చ శివదా శివ రూపిణీ ।
భవేశ్వరీ భవారాధ్యా భవేశీ భవనాయికా ॥22

భవమాతా భవగమ్యా భవకణ్టకనాశినీ ।
భవప్రియా భవానన్దా భవానీ భవమోహినీ ॥23

గాయత్రీ చైవ సావిత్రీ బ్రహ్మాణీ బ్రహ్మరూపిణీ ।
బ్రహ్మేశీ బ్రహ్మదా బ్రహ్మా బ్రహ్మాణీ బ్రహ్మవాదినీ ॥24

దుర్గస్థా దుర్గరూపా చ దుర్గా దుర్గార్తి నాశినీ ।
సుగమా దుర్గమా దాన్తా దయాదోగ్ధ్రీ దురాపహా ॥25

దురితఘ్నీ దురాధ్యక్షా దురా దుష్కృతనాశినీ ।
పఞ్చస్థా పఞ్చమీ పూర్ణాపీఠవినాశినీ ॥26

సత్త్వస్థా సత్త్వరూపా చ సత్త్వస్థా సత్త్వసమ్భవా ।
రజస్థా చ రజోరూపా రజోగుణ సముద్భవా ॥27

తమస్స్థా చ తమోరూపా తామసీ తామసప్రియా ।
తమోగుణసముద్భూతా సాత్త్వికీ రాజసీకలా ॥28

కాష్ఠా ముహూర్తా నిమిషా అనిమేషా తతః పరమ్ ।
అర్ధమాసా చ మాసా చ సంవత్సరస్వరూపిణీ ॥29
యోగస్థా యోగరూపా చ కల్పస్థా కల్పరూపిణీ ।
నానారత్నవిచిత్రాఙ్గీ నానాభరణ మణ్డితా ॥30
విశ్వాత్మికా విశ్వమాతా విశ్వపాశ వినాశినీ ।
విశ్వాసకారిణీ విశ్వా విశ్వశక్తి విచారణా ॥31
యవాకుసుమ సఙ్కాశా దాడిమీ కుసుమోపమా ।
చతురఙ్గీ చతుర్బాహు శ్చతురాచార వాసినీ ॥32
సర్వేశీ సర్వదా సర్వా సర్వదా సర్వదాయినీ ।
మహేశ్వరీ చ సర్వాద్యా శర్వాణీ సర్వమఙ్గలా ॥33
నలినీ నన్దినీ నన్దా ఆనన్దానన్దవర్ధినీ ।
వ్యాపినీ సర్వభూతేషు భవభారవినాశినీ ॥34
సర్వశృఙ్గారవేషాఢ్యా పాశాఙ్కుశ కరోద్యతా ।
సూర్యకోటి సహస్రాభా చన్ద్రకోటినిభాననా ॥35
గణేశకోటిలావణ్యా విష్ణుకోట్యరిమర్దినీ ।
దావాగ్నికోటి నలినీ రుద్రకోట్యు గ్రరూపిణీ ॥36
సముద్రకోటి గమ్భీరా వాయుకోటి మహాబలా ।
ఆకాశకోటి విస్తారా యమకోటి భయఙ్కరీ ॥37
మేరుకోటిసముచ్ఛ్రాయా గణకోటి సమృద్ధిదా ।
నిష్కలస్తోకా విరాధారా నిర్గుణా గుణ వర్జితా ॥38

అశోకా శోకరహి తాపత్రియ వివర్జితా ।
వసిష్ఠా విశ్వజననీ విశ్వాఖ్యా విశ్వవర్ధినీ ॥39

చిత్రా విచిత్రా చిత్రాఙ్గీ హేతుగర్భా కులేశ్వరీ ।
ఇచ్ఛాశక్తిః జ్ఞానశక్తిః శుచిస్మితా ॥40

శుచిః స్మృతిమయీ సత్యా శ్రుతిరూపా శ్రుతిప్రియా ।
మహాసత్త్వమయీ సత్త్వా పఞ్చతత్త్వోపరిస్థితా ॥41

పార్వతీ హిమవత్పుత్రీ పారస్థాపార రూపిణీ ।
జయన్తీ భద్రకాలీ చ అహల్యా కులనాయికా ॥42

భూతధాత్రీ చ భూతేశీ భూతస్థా భూతభావనా ।
మహాకుణ్డలినీశక్తిర్మహావిభవ వర్ధినీ ॥43

హంసాక్షీ హంస రూపా చ హంసస్థా హంసరూపిణీ ।
సోమ సూర్యాగ్ని మధ్యస్థా మణి మణ్డల వాసినీ ॥44

ద్వాదశారసరోజస్థా సూర్యమణ్డల వాసినీ ।
అకలఙ్కా శసాఙ్కాభా షోడశారనివాసినీ ॥45

డాకినీ రాకినీ చైవ లాకినీ కాకినీ తథా ।
శాకినీ హాకినీ చైవ షట్చక్రేషు నివాసినీ ॥46

సృష్టి స్థితి వినాశాయ సృష్టి స్థిత్యన్తకారిణీ ।
శ్రీకణ్ఠప్రియ హృత్కణ్ఠానన్దాఖ్యా బిన్దుమాలినీ ॥47

చతుష్షష్టికలాధారా దేహదణ్డ సమాశ్రితా ।
మాయా కాలీ ధృతి ర్మేధా క్షుధా తుష్టి ర్మహాద్యుతిః ॥48

హిలా మఙ్గలా సీతా సుషుమ్నా మధ్యగామినీ ।
పరఘోరా కరాలాక్షీ విజయా జయదాయినీ ॥49

హృత్పద్మనిలయా భీమ మహాభైరవ నాదినీ ।
ఆకాశలిఙ్గసమ్భూతా భువనోద్యాన వాసినీ ॥50

మహత్సూక్ష్మా చ కఙ్కాలీ భీమరూపా మహాబలా ।
మేనకా గర్భసమ్భూతా తప్తకాఞ్చన సన్నిభా ॥51

అన్తరస్థా కూటబీజా త్రికూటాచలవాసినీ ।
వర్ణాఖ్యా వర్ణరహితా పఞ్చాశద్వర్ణ భేదినీ ॥52

విద్యాధరీ లోకధాత్రీ అప్సరా అప్సరఃప్రియా ।
దీక్షా దాక్షయణీ దక్షా దక్షయజ్ఞవినాసినీ ॥53

యశః పూర్ణా యశోగా చ యశోదాగర్భ సమ్భవా ।
దేవకీ దేవ మాతా చ రాధికా కృష్ణవల్లభా ॥54

అరున్ధతీ శచీన్ద్రాణీ గాన్ధారీ గన్ధమాలినీ ।
ధ్యానాతీతా ధ్యానగమ్యా ధ్యానజ్ఞా ధ్యానధారిణీ ॥55

లమ్బోదరీ చ లమ్బోష్ఠీ జామ్బవన్తీ జలోదరీ ।
మహోదరీ ముక్తకేశ ముక్త కామార్థసిద్ధిదా ॥56

తపస్వినీ తపోనిష్ఠా సుపర్ణా ధర్మ వాసిని ।
బాణచాపధరా ధీరా పాఞ్చాలీ పఞ్చమప్రియా ॥57

గుహ్యాఙ్గీ చ సుభీమా చ గుహ్య తత్త్వనిరఞ్జనా ।
అశరీరా శరీరస్థా సంసారార్ణవతారిణీ ॥58

అమృతా నిష్కలా భద్రా సకలా కృష్ణపిఙ్గలా ।
చక్రప్రియా చ చక్రాహ్వా పఞ్చ చక్రాదిధారిణీ ॥59

పద్మరాగ ప్రతీకాశా నిర్మలాకాశ సన్నిభా ।
అధఃస్థా ఊర్ధ్వరూపా చ ఊర్ధ్వ పద్మనివాసినీ ॥60

కార్య కారణ కర్తృత్వే శశ్వద్రూపేషుసంస్థితా ।
రసజ్ఞా రసమధ్యస్థా గన్ధరూపిణీ ॥61

పరబ్రహ్మస్వరూపా చ పరబ్రహ్మనివాసినీ ।
శబ్దబ్రహ్మస్వరూపా చ శబ్దస్థా శబ్ద వర్జితా ॥62

సిద్ధి ర్వృద్ధిః పరాబుద్ధిః సన్దీప్తి ర్మధ్య సంస్థితా ।
స్వగుహ్యా శామ్భవీ శక్తిస్తత్త్వస్థా తత్త్వరూపిణీ ॥63

శాశ్వతీ భూతమాతా చ మహాభూతాధిప ప్రియా ।
శుచిప్రేతా ధర్మసిద్ధిః ధర్మ వృద్ధిః పరాజితా ॥64

కామసన్దీపినీ కామా సదాకౌతూహలప్రియా ।
జటాజూటధరా ముక్తా సూక్ష్మ శక్తివిభూషణా ॥65

దీపి చర్మపరిధానా చీరవల్కలధారిణీ ।
త్రిశూల డమరూధరా నరమాలా విభూషణా ॥66

అత్యుగ్రరూపిణీ చోగ్రాకల్పాన్త దహనోప మా ।
త్రైలోక్య సాధినీ సాధ్యా సిద్ధిసాధక వత్సలా ॥67

సర్వ విద్యామయీ సారా చాసురాణాం వినాశినీ ।
దమనీ దామనీ దాన్తా దయాదోగ్ధ్రీ దురాపహా ॥68

అగ్ని జిహ్వాసమా ఘోర ఘోర ఘోరతరాననా ।
నారాయణీ నారసింహీ నృసింహ హృదయేస్థితా ॥69

యోగేశ్వరీ యోగరూపా యోగమాతా చ యోగినీ ।
ఖేచరీ ఖచరీ ఖేలా నిర్వాణ పద సంశ్రయా ॥70

నాగినీ నాగకన్యా చ సువేశా నాగనాయికా ।
విషజ్వాలవతీ దీప్తా కలాశత విభూషణా ॥71

తీవ్రవక్త్రా మహా వక్త్రా నాగకోటిత్వధారిణీ ।
మహాసత్త్వాచ ధర్మజ్ఞా ధర్మాతి సుఖదాయినీ ॥72

కృష్ణ మూర్ధామహామ మూర్ధా ఘోర మూర్ధా వరాననా ।
సర్వేన్ద్రియ మనోనత్మా సర్వేన్ద్రియ మనోమయీ ॥73

సర్వసజ్గ్రామ జయదా సర్వప్రహరణోద్యతా ।
సర్వపీడోపశమనీ సర్వారిష్ట నివారిణీ ॥74

సర్వైశ్వర్య సముత్పన్నా సర్వగ్రహ వినాశినీ ।
మాతఙ్గీ మత్తమాతఙ్గీ మాతఙ్గీప్రియ మణ్డలా ॥75

అమృతో దధి మధ్యస్థా కటి సూత్రైరలంకృతా ।
అమృతోదధిమధ్యస్థా ప్రవాలవసనామ్బుజా ॥76

మణిమణ్డల మధ్యస్థా ఈ షత్ప్రహాసితాననా
కుముదా లలితాలోలా లాక్షాలోహితలోచనా ॥77

దిగ్వాసాదేవదూతీ చ దేవదేవాధి దేవతా ।
సింహోపరి సమారూఢా హిమాచలనివాసినీ ॥78

అట్టాట్టహాసినీ ఘోరాఘోరదైత్య వినాశినీ ।అత్యుగ్రరక్త వస్త్రాభా నాగకేయూరమణ్డితా ॥79. ముక్తాహారతోపేతా తుంగపీన పయోధరా । రక్తోత్పల దలాకారా మదాఘూర్ణితలోచనా ॥80॥ సమస్తదేవతామూర్తిః సురారిక్షయకారిణీ । ఖడ్గినీ శూలహస్తా చ చక్రిణీ చక్రమాలినీ ॥81. శంఖిణీ చాపినీ వాణీ వజ్రిణీ వజ్రిద ణ్డినీ । ఆనన్దోదధి మధ్యస్థా కటిసూత్రైరలంకృతా ॥82. నానాభరణ దీప్తాఙ్గా నానామణివిభూషితా । జగదానన్ద సమ్భూతా చిన్తామణి గుణానిత్యా ॥83. త్రైలోక్య నమితా తుర్యా చిన్మయానన్దరూపిణీ, త్రైలోక్య నన్దినీ దేవీ దుస్స్వప్న నాశినీ ॥84. ఘోరాగ్ని దాహశ మనీ రాజ్యదేవార్థ సాధినీ । మహాపరాధరాశిఘ్నీ మహా చౌర భయాపహా ॥85. రాగాది దోషరహితా జరామరణ వర్జితా । చన్ద్రమణ్డల మధ్యస్థా పీయూషార్ణవ సమ్భవా ॥86. సర్వదేవైః స్తుతాదేవీ సర్వసిద్ధైర్న మస్కృతా । అచిన్త్య శక్తిరూపాచ మణి మన్త్ర మహౌషధీ ॥87. అస్థిమయీ బాలామలయాచల వాసినీ । ధాత్రీ విధాత్రీ సంహారీ రతిజ్ఞారతీదాయినీ ॥88. రుద్రాణీ రుద్రరూ పాచ రుద్రరౌద్రార్తి నాశినీ । సర్వజ్ఞా చైవ ధర్మజ్ఞా రసజ్ఞా దీన వత్సలా ॥89. అనాహతా త్రినయనావిర్భావానిర్వృతిః పరా, పరాఘోరాకరాలాక్షీ సుమతీ శ్రేష్ఠదాయినీ ॥90. మన్త్రాలికా మన్త్ర గమ్యా మన్త్రమాలా సుమన్త్రిణీ । శ్రద్ధానన్దమహాభద్రా నిర్ద్వంద్వా నిర్గుణాత్మికా ॥91. ధరిణీ ధారిణీ పృథ్వీధరాధాత్రీ వసున్ధరా । మేరుమన్దర మధ్యస్థాస్థితిః శంకర వల్లభా ॥92. శ్రీమతీ

శ్రీమయీ శ్రేష్ఠా శ్రీకరీ భావభావినీ । శ్రీదా శ్రీమాతా శ్రీనివాసా శ్రీమతీ శ్రీమాతాజ్గతిః ॥93. ఉమాసారజ్గణీ కృష్ణా కుటిలా కుటిలాలకా । త్రిలోచనా త్రిలోకాత్మా పుణ్యా పుణ్యప్రకీర్తితా॥94. అమృతా సత్య సఙ్కల్పా సాసత్యాగ్రన్థి భేదినీ । పరేశ పరమా సాధ్యా పరావిద్యా పరాత్పరా ॥95. సున్దరాఙ్గీ సువర్ణాభా సురాసుర నమస్కృతా । ప్రజా ప్రజావతీ ధన్యా ధనధాన్య సమృద్ధిదా॥96. ఈశానీ భువనేశానీ భవానీ భువనేశ్వరీ । అనన్తానన్తమహితా జగత్పరా జగద్భవా ॥97. అచిన్త్యాత్మాచిన్త్య శక్తిశ్చిన్త్యాచిన్త్య స్వరూపిణీ । జ్ఞానగమ్యా జ్ఞానమూర్తి ర్జ్ఞానినీ జ్ఞానశాలినీ ॥98. అసితాఘోర రూపా చ సుధాధారా సుధాపహా । భాస్కరీ భాస్వతీ భీతిర్ భాస్వదక్షానుశాయినీ ॥99. అనసూయాక్షమాలజ్జా దుర్లభా భరణాత్మికా । విశ్వఘ్నీ విశ్వనీరా చ విశ్వఘ్నీ విశ్వసంస్థితా॥100. శీలస్థా శీలరూపా చ శీలాశీల ప్రదాయినీ । బోధనీ బోధకుశలా రోధనీ బోధనీ తథా ॥101. విద్యోతినీ విచిత్రాత్మ విద్యుత్పాటల సన్నిభా ।విశ్వయోనిర్మహాయోనిః కర్మయోనిః ప్రియాత్మికా॥102. రోహిణీ రోగశమనీ మహారోగ జ్వరాపహా । రసదా పుష్టిదా పుష్టి ర్మానదా మానవప్రియా ॥103. కృష్ణాఙ్గీ వాహినీ కృష్ణా కృష్ణా కృష్ణసహోదరీ । శామ్భవీ శమ్భురూపా చ శమ్భుస్థా శమ్భు సమ్భవా ॥104. విశ్వోదరీ యోగమాతా యోగ ముద్రాఘ్న యోగినీ । వాగీశ్వరీ యోగనిద్రా యోగినీ కోటిసేవితా ॥105. కౌలికా మన్దకన్యా చ శృంగేరీపీఠ వాసినీ । క్షేమఙ్కరీ సర్వరూపా

దివ్యరూపా దిగమ్బరీ ॥106. ధూమ్రవక్త్రా ధూమనేత్రా ధూమ్రకేశ చ దూసరా । పినాకినీ రుద్రవేతాలీ మహావేతాలరూపిణీ ॥107. తపినీ తాపినీ దీక్షా విష్ణు విద్యాత్మ నాశ్రితా । మన్దరా జఠరాతీవ్రా అగ్నిజిహ్వా భయాపహా ॥108. పశుగ్నీ పశురూపా చ పశుహాపశు వాహినీ । పితా మాతా చ ధీరా చ పశుపాశవినాశినీ ॥109. చన్ద్రప్రభా చన్ద్రరేఖా చన్ద్రరేఖా చన్ద్ర కాన్తి విభూషిణీ । కుంకుమాఙ్కితసర్వాఙ్గీసు ధా సద్గురులోచనా ॥110. శుక్లామ్బర ధరా దేవీ వీణాపుస్త కధారిణీ । ఐరావత పద్మధారా శ్వేత పద్మ సన స్థితా ॥111. రక్తాంబరా ధరాదేవీ రక్తా పదవిలోచనా । దుస్తరా తారిణీ తారా తరుణీ తారరూపిణీ ॥112. సుధాధారా చ ధర్మజ్ఞా ధర్మ సఙ్గోపదేశినీ । భగేశ్వరీ భగారాధ్యా భగినీ భగనాయికా॥113. భగ బిమ్బా భగక్లిన్నా భగయోని ర్భగప్రదా । భగేశ్వరీ భగా రాధ్యా భగినీ భగనాయకా ॥114. భగేశీ భగరూపా చ భగ గుహ్యా భగావహా । భగోదరీ భగానన్దా భగస్తా భగశాలినీ ॥115. సర్వసంక్షోభిణీశక్తిః సర్వవిద్రావిణీ తథా । మాలినీ మాధవీ మాధ్వీ మధురూపా మహోత్కటా ॥116. భరుణ్డ చన్ద్రికా జోత్స్నా విశ్వచక్షుస్తమోపహా । సుప్రసన్నా మహాదూతీ యమదూతీ భయ ఙ్కరీ ॥117. ఉన్మాదినీ మహారూపా దివ్యరూపా సురార్చితా । చైతన్యరూపిణీ నిత్యాక్లిన్నా కామమదోద్ధతా ॥118. మదిరానన్ద కైవల్యా మదిరాక్షి మదాలసా । సిద్ధేశ్వరీ సిద్ధ విద్యా సిద్దాద్యా సిద్ధి వమ్భవా ॥119. సిద్ధిర్భిః సిద్ధమాతా చ సిద్ది స్సర్వార్థ సిద్ధిదా ।

మనోమయీ గుణాతీతా పరంజ్యోతిః స్వరూపిణీ ॥120. పరదేశీ పరగా పారా పరాసిద్ధిః పరాగతిః । విమలా మోహినీ ఆద్యా మధుపానపరాయణా ॥121. వేదవేదాఙ్గజననీ సర్వశాస్త్రవిశారదా । సర్వదేవమయీవిద్యా సర్వశాస్త్రమయీతథా ॥122. సర్వజ్ఞానమయీదేవీ సర్వధర్మమయీశ్వరీ । సర్వ యజ్ఞమయీ యజ్ఞామన్త్రాధికారిణీ ॥123. సర్వ సమ్పత్ప్రతిష్ఠాత్రీ సర్వవిద్రావిణీపరా సర్వసక్షోభిణీదేవీ సర్వమఙ్గలకారిణీ ॥124. త్రైలోక్యాకర్షిణీదేవీ సర్వాహ్లాదనకారిణీ ।సర్వసమ్మోహినీదేవీ సర్వ స్తమ్భనకారిణీ॥125. త్రైలోక్య జృంభిణీదేవీ తథా సర్వవంశఙ్కరీ । త్రైలోక్యరఞ్జనీదేవీ సర్వసమ్పత్తిదాయినీ 126. సర్వమన్త్రమయీ దేవీ సర్వ ద్వన్ద్వక్షయఙ్కరీ । సర్వసిద్ధిప్రదాదేవీ సర్వ సమ్పత్ప్రదాయినీ ॥127. సర్వప్రియకరీదేవీ సర్వమఙ్గలకారిణీ । సర్వకామప్రదాదేవీ సర్వ దుఃఖ విమోచినీ ॥128. సర్వమృత్యుప్రశమనీ సర్వవిఘ్నవినాశినీ । సర్వాఙ్గసున్దరీ మాతా సర్వ సౌభాగ్యదాయినీ ॥129. సర్వజ్ఞా సర్వశక్తిశ్చ సర్వైశ్వర్యఫలప్రదా । సర్వజ్ఞానమయీ దేవీ సర్వ వ్యాధివినాశినీ ॥130. సర్వాధారస్వరూపా చ సర్వపాపహరా తథా । సర్వానన్దమయీదేవీ సర్వేక్షాయాఃస్వరూపిణీ ॥131. సర్వలక్ష్మీమయీవిద్యా సర్వేప్సితఫలప్రదా । సర్వారిష్టప్రశమనీ పరమానన్దదాయినీ ॥132. త్రికోణ నిలయాత్రిస్థా త్రిమాత్రా త్రితనుస్థితా । త్రివేణీ త్రిపథాత్రిస్థా త్రిమూర్తి స్త్రిపురేశ్వరీ ॥133. త్రిధామ్నా త్రిదశాధ్యక్షా త్రివి త్రిపురవాసినీ । త్రయీ విద్యా చ త్రిశిరా త్రైలోక్యా చ త్రిపుష్కరా ॥134. త్రికోటరస్థా త్రివిధా త్రిపురా త్రిపురాత్మికా । త్రిపురా శ్రీత్రిజననీ త్రిపురా త్రిపురసున్దరీ ॥135. ఇదంత్రిపురసున్దర్యా స్తోత్రన్నామ సహస్రకమ్ ॥

# అనుబంధము 4

## శ్రీ లలితా త్రిశతీస్తోత్ర రత్న నామావళిః

ఓం ఐం హ్రీం శ్రీం, కకారరూపాయైనమః ఓం, కల్యాణ్యై, కల్యాణగుణశాలిన్యై, కల్యాణశైలనిలయాయై, కమనీయాయై, కలావత్యై, కమలాక్ష్యై, కల్మషఘ్న్యై, కరుణామృతసాగరయై, కదంబకాననావాసాయై, కదంబకుసుమ ప్రియాయై, ౧౦ కందర్పవిద్యాయై, కందర్పజనకాపాంగ వీక్షణాయై, కర్పూర వీటికాసౌరభ్యకల్లోలితకకుప్తటాయై, కలిదోష హరాయై, కంజలోచనాయై, కమ్ర విగ్రహాయై, కర్మాది సాక్షిణ్యై, కారయిత్ర్యై, కర్మఫలప్రదాయై, ఏకార రూపాయై, ౨౦ ఏకాక్షర్యై, ఏకానేకాక్షరాకృత్యై, ఏతత్తదిత్యనిర్దేశ్యాయై, ఏకానంత చిదాకృత్యై, ఏవమిత్యాగమాబోధ్యాయై, ఏకభక్తిమదర్చితాయై, ఏకాగ్రచిత్తనిర్ధ్యాతాయై, ఏషణారహితాదృతాయై, ఏలాది సుగంధి చికురాయై, ఏనఃకూటవినాశిన్యై ౩౦ ఏక భోగాయై, ఏక రసాయై ఏకైశ్వర్యప్రదాయిన్యై, ఏకాతపత్రసామ్రాజ్యప్రదాయై, ఏకాంత పూజితాయై, ఏధమానప్రభాయై, ఏజదనేజజ్జగదీశ్వర్యై, ఏకవీరాదిసంసేవ్యాయై, ఏకప్రాభవశాలిన్యై, ౪౦ ఈకార రూపిణ్యై, ఈశిత్ర్యై, ఈప్సితార్థప్రదాయిన్యై, ఈదృగిత్య నిర్దేశ్యాయై, ఈశ్వరత్వవిధాయిన్యై, ఈశానాది బ్రహ్మమయ్యై, ఈశత్వాద్యష్టసిద్ధిదాయై, ఈక్షిత్ర్యై, ఈక్షణ సృష్టాండకోట్యై.

ఈశ్వరవల్లభాయై, ౫౦ ఈడితాయై, ఈశ్వరార్ధాంగశరీరాయై, ఈశాధిదేవతాయై, ఈశ్వరప్రేరణకర్త్ర్యై, ఈశతాండవ సాక్షిణ్యై, ఈశ్వరోత్సంగనిలయాయై, ఈతిబాధావినాశిన్యై, ఈహావిరహితాయై, ఈశశక్త్యై, ఈషత్స్మితాననాయై, ౬౦ లకార రూపాయై, లలితాయై, లక్ష్మీవాణీనిషేవితాయై, లాకిన్యై, లలనారూపాయై, లసద్దాడిమపాటలాయై, లంతికాలసత్ఫలాయై, లలాటనయనార్చితాయై, లక్షణోజ్జ్వలదివ్యాంగ్యై, లక్ష్యకోట్యండనాయికాయై, లక్ష్యార్థాయై, ౭౦ లక్షణాగమ్యాయై, లబ్ధకామాయై, లతాతనవే, లలామరాజదలికా, లంబముక్తాలతాంచితాయై, లంబోదర ప్రసవే, లభ్యాయై, లజ్జాఢ్యాయై, లయవర్జితాయై, ౮౦ హ్రీంకార రూపాయై, హ్రీంకార నిలయాయై, హ్రీంపదప్రియాయై, హ్రీంకారబీజాయై, హ్రీంకారమంత్రాయై, హ్రీంకార లక్షణాయై, హ్రీంకారజపసుప్రీతాయై, హ్రీంమత్యై, హ్రీంవిభూషణాయై, హ్రీంశీలాయై, ౯౦ హ్రీం పదారాధ్యాయై, హ్రీం గర్భాయై, హ్రీంపదాభిధాయై, హ్రీంకారవాచ్యాయై, హ్రీంకారపూజ్యాయై, హ్రీంకార పీఠికాయై, హ్రీంకార వేద్యాయై, హ్రీంకారచింత్యాయై, హ్రీం యై, హ్రీంశరీరిణ్యై, ౧౦౦ హకారరూపాయై, రాధ్యాయై, హలధృత్పూజితాయై, హరిణేక్షణాయై, హర ప్రియాయై, హరారాధ్యాయై, హరబ్రహ్మేంద్రసేవితాయై, హయారూఢా సేవితాంఘ్ర్యై, హయమేధసమర్చితాయై, హర్యక్షవాహనాయై, హంసవాహనాయై, ౧౧౦ హతదానవాయై, హత్యాదిపాపశమన్యై, హరిద

శ్వాది సేవితాయై, హస్తి కుంభోత్తుఙ్గకుచాయై. హరిద్రాకుంకుమాది
గ్ధాయై. హర్యశ్వాద్యమరార్చితాయై, హరి కేశ సఖ్యై. హాది
విద్యాయై. హాలామదాలసాయై. ౧౨౦ సకార రూపాయై,
సర్వజ్ఞాయై. శర్వేశ్యై. సర్వమంగలాయై. సర్వ కర్త్ర్యై.
సర్వధాత్ర్యై. సర్వహంత్ర్యై. సర్వానవద్యాయై. సర్వాంగ
సుందర్యై. ౧౩౦ సర్వసాక్షిణ్యై. సర్వాత్మికాయై, సర్వసౌఖ్య
దాత్ర్యై. సర్వమోహిన్యై. సర్వ ధారయై, సర్వ గతాయై, సర్వావ
గుణవర్జితాయై, సర్వారుణాయై, సర్వ మాత్రే. సర్వాభరణ భూషి
తాయై, కకారార్థాయై, ౧౪౦ కామేశ్యై. కామితార్థదాయై, కామ సంజీ
విన్యై. కల్యాయై, కఠిన స్తనమండలాయై, కర భోరవే, కళానాథ
ముఖ్యై. కచ జితాంబుజీయై, ౧౫౦ కటాక్షస్యంది కరుణాయై, కపాలి
ప్రాణనాయికాయై, కారుణ్యవిగ్రహాయై. కాంతాయై, కాంతిధూత
జపావల్యై. కలాలాపాయై, కంచుకంఠ్యై, కర నిర్జిత పల్లవాయై.
కల్పవల్లీసమభుజాయై, కస్తూరీ తిలకోజ్జ్వలాయై. ౧౬౦
హకారార్థాయై, హంసగత్యై. హాటకాభరణోజ్జ్వలాయై, హార
హారికుచాభోగాయై, హాకిన్యై, హల్యవర్జితాయై, హరిత్పతి సమారా
ధ్యాయై, హఠాత్కారహతాసురాయై, హర్షప్రదాయై, హవిర్భోక్త్ర్యై ౧౭౦
హార్దసంతమసాపహాయై, హల్లీహాలాస్యసంతుష్టాయై, హంస
మంత్రార్థరూపిణ్యై, హానోపాదాననిర్ముక్తాయై, హర్షిణ్యై, హరి
సోదర్యై, హాహా హూహూముఖస్తుతా, హానివృద్ధి వివర్జితాయై,
హయ్యంగవీన హృదయాయై, హరి కోపారుణాంశుకాయై, ౧౮౦
లకారార్థాయై, లతాపూజ్యాయై, లయస్థిత్యుద్భవేశ్వర్యై, లాస్యదర్శన

సంతుష్టాయై, లాభా లాభ వివర్జితాయై,లంఘ్యేతర రాజ్ఞాయై, లావణ్య శాలిన్యై, లఘుసిద్ధిదాయై, లక్షారసవవర్ణాభాయై, లక్ష్మణాగ్రజ పూజితాయై, ౧౯౦ లభ్యేతరాయై, లబ్ధభక్తి సులభాయై, లాంగలాయుధాయై, లగ్నచామరహస్త, శ్రీశారదాపరివీజితాయై, లజ్జాపద, లంపటాయై, లకుళేశ్వర్యై, లబ్ధమానాయై, లబ్ధ రసాయై, లబ్ధ సంపత్సమున్నత్యై, ౨౦౦ హ్రీంకారిణ్యై, హ్రీంకారాదయే, హ్రీంమధ్యాయై, హ్రీం శిఖామణయే, హ్రీంకారకుండాగ్ని శిఖాయై, హ్రీంకారశశిచన్ద్రికాయై, హ్రీంకారభాస్కర రుచ్యై, హ్రీంకారాంభోద చంచలాయై, హ్రీంకారకందాంకురికాయై, హ్రీంకార్తికపరాయణాయై, ౨౧౦ 210 హ్రీంకారదీర్ఘికాహంస్యైం హ్రీంకారోద్యానకేశిన్యై, హ్రీంకారారణ్యహరిణ్యై, హ్రీం, కారావాలవల్లర్యై, హ్రీంకార పంజరశుక్యై, హ్రీంకారకందరాసింహైని, హ్రీంకారాంబుజభంగికాయై, హ్రీంకారసుమనో మాధ్వ్యై, హ్రీంకారతరుమంజర్యై, సకారాఖ్యాయై ౨౨౦ సమరసాయై, సకలాగమసంస్తుతాయై, సర్వవేదాంతతాత్పర్యభూమ్యై, సదసదాశ్రియాయై, సకలాయై, సచ్చిదానందాయై, సాధ్వ్యై, సద్గతి దాయిన్యై, సనకాది మునిధ్యేయాయై, సదాశివ కుటుంబిన్యై,౨౩౦ సకలాధిష్ఠాన రూపాయై, సత్త్వ రూపాయై, సమాకృత్యై, సర్వ ప్రపంచనిర్మాత్ర్యై, సమానాధికవర్జితాయై, సర్వోత్తుంగాయై, సంగహీనాయై, సద్గుణాయై, సకలేష్టదాయై, ౨౪౦ కకారిణ్యై, కావ్య లోలాయై, కామేశ్వర మనోహరాయై, కామేశ్వరమనో

హరాయై, కామేశ్వరప్రాణనాడ్యై, కామేశోత్సంగ వాసిన్యై,
కామేశ్వరాలింగితాంగ్యై, కామేశ్వరసుఖప్రదాయై, కామేశ్వర
ప్రణయిన్యై, కామేశ్వరవిలాసిన్యై, కామేశ్వర తపస్సిద్ధ్యై ౨౫౦

కామేశ్వరమనఃప్రియాయై, కామేశ్వరప్రాణనాథాయై, కామేశ్వర
విమోహిన్యై, కామేశ్వరబ్రహ్మవిద్యాయై, కామేశ్వరగృహే
శ్వర్యై, కామేశ్వరాహ్లాదకర్యై, కామేశ్వరమహేశ్వర్యై,
కామేశ్వర్యై, కామకోటినిలయాయై, కాంక్షితార్థదాయై ౨౬౦,
లకారిణ్యై, లబ్ధరూపాయై, లబ్ధధియే, లబ్ధవాంఛితాయై, లబ్ధ పాప
మనోదూరాయై, లబ్ధాహంకారదుర్గమాయై, లబ్ధశక్త్యై, లబ్ధ
దేహాయై, లబ్ధైశ్వర్యసమున్నత్యై, లబ్ధబుద్ధయే ౨౭౦, లబ్ధ
లీలాయై, లబ్ధయౌవనశాలిన్యై, లబ్ధాతిశయసర్వాంగసౌంద
ర్యాయై, లబ్ధవిభ్రమాయై, లబ్ధరాగాయై, లబ్ధగత్యై, లబ్ధానంగాగ
మస్థిత్యై, లబ్ధభోగాయై, లబ్ధసుఖాయై, లబ్ధహర్షాభిపూజి
తాయై ౨౮౦, హ్రీంకారమూర్తయే, హ్రీంకారసౌధ
శృంగకపోతికాయై, హ్రీంకారదుగ్ధాబ్ధిసుధాయై, హ్రీంకారకమ
లేన్దిరాయై, హ్రీంకారమణిదీపార్చిషే, హ్రీంకారతరుశారి
కాయై, హ్రీంకారపేటకమణయే, హ్రీంకారాదర్శబింబికాయై,
హ్రీంకారకోశాసిలతాయై, హ్రీంకారాస్థాననర్తక్యై ౨౯౦,
హ్రీంకారశుక్తికాముక్తామణయే, హ్రీంకారబోధితాయై, హ్రీంకార
మయసౌవర్ణస్తంభవిద్రుమపుత్రికాయై, హ్రీంకారవేదోపనిషదే,
హ్రీంకారాధ్వరదక్షిణాయై, హ్రీంకారనందనారామకల్పకవల్లర్యై,

హ్రీంకారహిమవద్గంగాయై, హ్రీంకారార్ణవకౌస్తుభాయై, హ్రీంకార మంత్రసర్వస్వాయై, హ్రీంకారవరసౌఖ్యదాయై. ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమద్రాజరాజేశ్వర్యై నమః ఓం 300 ప్రతి నామమునకు చివర 'ఓం'ను చేర్చి పూజచేయవలెను.

ఇతి బ్రహ్మాండపురాణే, హయగ్రీవాగస్త్యసంవాదే,
లలితోపాఖ్యానే, స్తోత్రఖండే,
లలితాంబా త్రిశతీస్తోత్ర నామావలిః
సమాప్తః

# అనుబంధము 5

## శ్రీ చక్ర నవావరణ పూజకు కావలసిన సామగ్రి

1. పాపుకిలో పసుపుతో చేసిన కుంకుమ (రంగు కుంకుమ కాదు). 2. పూవులు విడిగా ఉన్నవి (250 గ్రాములు). 3. రెండు పూలదండలు. 4. అల్లపు ముక్క. 5. శంఖము. 6. గంధము. 7. పసుపు. 8. శంఖము పెట్టుటకు ఆధారముగ గిన్నె. 9. తీర్థపు గిన్నెలు 12 (చిన్నవి) (ఉన్నచో). 10. ఘంట. 11. హారతిఇచ్చే పాత్ర. 12. అగరువత్తుల ప్యాకెట్. 13. హారతి కర్పూరపు ప్యాకెట్లు 6 నెంబరులు. 14. పూర్ణకుంభపు దీపము. 15. ఎరుపు బియ్యపు అక్షతలు. 16. రెండు చెమ్మాలు. 17. పండ్లు (20 ఏవైననుసరే) (అరటిపళ్ళు, కమలా, దానిమ్మ, ఏపిల్),

18. పంచామృతములు, (ఆవుపాలు, పెరుగు, నెయ్యి, పంచదార, తేనె, 19. దద్ధోధనము. 20 పులిహోర, 21. వేయించిన గోధుమ రవ్వ పొడిది ప్రసాదము, పిలుచుకున్నవారికి సరిపడేటట్టు. 22. టెంకాయలు 2, 23. క్రొత్త చీపురుపుల్ల, 24. తమలపాకులు, 50, సున్నం, 25. వక్కపొడి, 26. రెండు చెంబులు, ఉద్ధరిణ, 27. గిన్నెలు, 28. అగ్గిపెట్టె, 30 దూదెవత్తులు, 29. కుంకుమ పువ్వు. 30. తెల్లగుడ్డ (యంత్రము స్నానం చేయించిన తరువాత తుడుచుటకు).

## అనుబంధము 6

## దేవీ ఖడ్గమాలా స్తోత్ర రత్న నామావలిః

ఓం ఐం హ్రీం శ్రీం, త్రిపుర సుందర్యైనమః ఓం. హృదయదేవ్యైనమః, శిరోదేవ్యై, శిఖాదేవ్యై, కవచదేవ్యై, నేత్ర దేవ్యై, అస్త్రదేవ్యై, కామేశ్వర్యై, భగమాలిన్యై, నిత్య క్లిన్నాయై ౧౦. భేరుండాయై, వహ్నివాసిన్యై, మహావజ్రే శ్వర్యై, శివ దూత్యై, త్వరితాయై, కులసుందర్యై, నిత్యాయై, నీల పతాకాయై, విజయాయై, సర్వమంగలాయై ౨౦, జ్వాలా మాలిన్యై, చిత్రాయై, మహానిత్యాయై, పరమేశ్వరీపరమేశ్వర్యై, మిత్రేశమయ్యై, షష్ఠీశమయ్యై, ఉడ్డీశమయ్యై, చర్యానాథమయ్యై, లోపాముద్రామయ్యై, అగస్త్యమయ్యై ౩౦. కాలతాపన మయ్యై, ధర్మాచారమయ్యై, ముక్తకేశీశ్వరమయ్యై, దీపకలా

నాథమయ్యై, విష్ణుదేవమయ్యై, ప్రభాకరదేవమయ్యై, తేజోదేవమయ్యై, మనోజదేవమయ్యై, కల్యాణదేవమయ్యై, వాసుదేవమయ్యై ౪౦, రత్నదేవమయ్యై, శ్రీరామానందమయ్యై, అణిమాసిద్ధయే, లఘిమాసిద్ధయే, గరిమాసిద్ధయే, మహిమాసిద్ధయే, ఈశిత్వసిద్ధయే, వశిత్వసిద్ధయే, ప్రాకామ్యసిద్ధయే, భుక్తిసిద్ధయే ౫౦ ఇచ్ఛాసిద్ధయే, ప్రాప్తిసిద్ధయే, సర్వకామసిద్ధయే, బ్రాహ్మ్యై, మహేశ్వర్యై, కౌమార్యై, వైష్ణవ్యై, వారాహ్యై, మాహేంద్ర్యై, చాముండాయై ౬౦ మహాలక్ష్మ్యై, సర్వసంక్షోభిణ్యై, సర్వవిద్రావిణ్యై, సర్వాకర్షిణ్యై, సర్వవశంకర్యై, సర్వోన్మాదిన్యై, సర్వమహాంకుశాయై, సర్వఖేచర్యై, సర్వబీజాయై, సర్వయోన్యై ౭౦, సర్వత్రిఖండాయై, త్రైలోక్యమోహనచక్రస్వామిన్యై, ప్రకటయోగిన్యై, కామాకర్షిణ్యై, బుధ్యాకర్షిణ్యై, అహంకారాకర్షిణ్యై, శబ్దాకర్షిణ్యై, స్పర్శాకర్షిణ్యై, రూపాకర్షిణ్యై, రసాకర్షిణ్యై ౮౦, గంధాకర్షిణ్యై, చిత్తాకర్షిణ్యై, ధైర్యాకర్షిణ్యై, స్మృత్యాకర్షిణ్యై, నామాకర్షిణ్యై, బీజాకర్షిణ్యై, ఆత్మాకర్షిణ్యై, అమృతాకర్షిణ్యై, శరీరాకర్షిణ్యై, సర్వాశాపరిపూరకచక్రస్వామిన్యై ౯౦, గుప్తయోగిన్యై, అనంగకుసుమాయై, అనంగమేఖలాయై, అనంగమదనాయై, అనంగమదనాతురాయై, అనంగరేఖాయై, అనంగవేగిన్యై, అనంగాంకుశాయై, అనంగమాలిన్యై, సర్వసంక్షోభణచక్రస్వామిన్యై ౧౦౦, గుప్తతరయోగిన్యై, సర్వసంక్షోభిన్యై, సర్వవిద్రావిణ్యై, సర్వాకర్షిణ్యై, సర్వాహ్లాదిన్యై, సర్వసమ్మోహిన్యై

సర్వ స్తంభిన్యై. సర్వజృంభిణ్యై. సర్వవశంకర్యై. సర్వరం జన్యై ౧౧౦, సర్వోన్మాదిన్యై. సర్వార్థ సాధికాయై. సర్వ సంపత్తి పూరణ్యై. సర్వమంత్రమయ్యై. సర్వద్వంద్వక్షయంకర్యై. సర్వ సౌభాగ్యదాయకచక్రస్వామిన్యై. సంప్రదాయయోగిన్యై. సర్వ సిద్ధి ప్రదాయై. సర్వప్రియంకర్యై. సర్వమంగలకారిణ్యై ౧౨౦, సర్వకామప్రదాయై. ఓం సర్వదుఃఖవిమోచన్యై. సర్వమృత్యుప్రశ మన్యై. సర్వవిఘ్ననివారిణ్యై. సర్వాంగసుందర్యై. సర్వసౌభాగ్య దాయిన్యై. సర్వార్థసాధక చక్రస్వామిన్యై. కులోత్తీర్ణ యోగిన్యై. సర్వజ్ఞాయై. సర్వశక్త్యై ౧౩౦. సర్వైశ్వర్యప్రదాయిన్యై. సర్వ జ్ఞానమయ్యై. సర్వవ్యాధివినాశిన్యై. సర్వాధారస్వరూపాయై. సర్వ పాపహరాయై. సర్వానందమయ్యై. సర్వరక్షాస్వరూపిణ్యై. సర్వేప్సి తఫలప్రదాయై. సర్వరక్షాకరచక్రస్వామిన్యై. నిగర్భయోగిన్యై ౧౪౦. వశిన్యై. కామేశ్వర్యై. మోదిన్యై. విమలాయై. అరు ణాయై. జయిన్యై. సర్వేశ్వర్యై. కౌలిన్యై. సర్వరోగహరచక్ర స్వామిన్యై. రహస్యయోగిన్యై ౧౫౦ బాణిన్యై. చాపిన్యై. పాశిన్యై. అంకుశిన్యై. మహాకామేశ్వర్యై. మహావజ్రేశ్వర్యై. మహాభగమా లిన్యై. సర్వసిద్ధిప్రదచక్రస్వామిన్యై. అతిరహస్యయోగిన్యై. శ్రీశ్రీ మహాభట్టారికాయై. సర్వానందమయచక్రస్వామిన్యై ౧౬౦, పరాపరరహస్యయోగిన్యై. త్రిపురాయై. త్రిపురేశ్యై. త్రిపుర వాసిన్యై. త్రిపురాశ్రితాయై. త్రిపురమాలిన్యై. త్రిపురా సిద్ధయే. త్రిపురాంబాయై ౧౭౦. మహాత్రిపురసుందర్యై. మహా

మహేశ్వర్యై. మహామహారాజ్ఞ్యై, మహామహాశక్త్యై. మహా మహా గుప్తాయై, మహామహాస్మృత్యై, మహామహాశయాయై, మహా మహా శ్రీచక్ర నగర సామ్రాజ్ఞ్యై నమః నమస్తే నమస్తే నమస్తే నమః ఓం.

ఇతి శ్రీ వామకేశ్వర తంత్రే. ఉమామహేశ్వరసంవాదే, దేవీ ఖడ్గమాలా స్తోత్ర రత్న నామావలిః

సమాప్తః

## అనుబంధము 7

## జ్ఞానదీపిక విపులాంధ్ర వ్యాఖ్యానముతో గూడిన శ్రీ భగవద్గీతపై, శ్రీ చివుకుల నరసింహంగారి విమర్శ

రచయిత : *శ్రీమత్ స్వామి ప్రణవానంద*

(కైలాస - మానస సరోవర తీరవాసి)

శ్రీ భగవద్గీతమీద అసంఖ్యాకములైన వ్యాఖ్యలు, ఉపన్యాసములు, అనువాదములు ఎన్నెన్నో ఉన్నవి. కాని శ్రీ ప్రణవానందస్వామి రచియించిన "జ్ఞానదీపిక" యను నీ గీతావ్యాఖ్యానము విశిష్టలక్షణములతో రూపొందియున్నది. అందలి విశిష్టత ఇది. ఉన్నది ఉన్నట్లుగాను చేసిన కేవల భాషానువాదము కాదు. అట్టి

అనువాదమే అయిన యెడల పూర్వాపర విరోధములు భాసించు చోటులలో చదువరి తన శక్త్యనుసారము, తన నిర్ణయము మీదనే ఆధారపడవలసియుండి అతడందు మునుగవచ్చును, తేలనువచ్చును. చదువరిని అతడు నిర్ణయమునకు వదిలిపెట్టు నుద్దేశమీ వ్యాఖ్యాతకులేదు. భగవద్గీతలోని నిగూఢార్థములను గూర్చిన స్వమతమును స్థాపించుటకై చేసిన విపుల వ్యాఖ్యానమునుగాదు. అనువాదగుణములకును, వ్యాఖ్యాన గుణములకునుగల మేలికలయికయే యీ వ్యాఖ్యానముయొక్క విశిష్టత. ఇందలి భాషసరళమును సలక్షణమును.

ఇందు ప్రతి అధ్యాయ ప్రారంభమున అధ్యాయ సంబంధమును వివరించునవతారికయు, ప్రతిశ్లోకమునకును ప్రారంభమున అనుబంధావతారికయు నుండును. ఈ యవతారికలు భగవద్గీతను సమగ్రముగ అవగాహన చేసికొనుటకు మిక్కిలి తోడ్పడుచున్నవి. ఇవి సందులు, గొందులు, వీధులతో నిండి దిక్కుతోచకుండు నగరమందు ప్రతివీధికి మొదట, దారిని తెలుపుటకై కట్టబడిన "మార్గఫలకము" (సైన్‌బోర్డువలె) నుండి చదువరిని సరియగు దారిలోనికి గొనిపోవుటకు తోడ్పడుచున్నవి. కావున చదువరి ఈ విషయమున వ్యాఖ్యాతకు కృతజ్ఞుడై యుండక తప్పదు.

గ్రుడ్డి నమ్మకముల సేవగించుకొనెడి ఆధునికుల మనస్సులను గూడ ఆకర్షించి ఈ వ్యాఖ్యానము వారిని సన్మార్గమునకు త్రిప్పజాలినదై మూల భగవద్గీతవలెనే అంతటియుక్తి యుక్తమై

యున్నది. "యజ్ఞములు చేసిన స్వర్గఫలము కలుగును. రాత్రిం దును, కృష్ణపక్షమందును మరణించిన వారికి అధోలోకములు కలుగును, శుక్లపక్షమందును ఉత్తరాయణమందును మరణించిన వారికి ఉత్తమ లోకములు కలుగును." — ఇత్యాదిగా కొన్ని విష యములు అంధ విశ్వాసములై తోచుచు బుద్ధిజీవులకు సమ్మదగిన విగా నుండవు. కాని ఈ వ్యాఖ్యానమున శ్రీ ప్రణవానందస్వామి ఈ విషయములను గూర్చి చేసిన వివరణము వారి అపోహను రూపుమాపి సత్య ప్రచండ భాస్కరుని వెలుగు వారియొక్క సంశయాంధకారమును, పటాపంచలు చేయుచున్నది.

ఏతద్వ్యాఖ్యాత భగవద్గీతను శ్రద్ధతో క్షుణ్ణముగా అధ్యయనము చేసినవారు, నిత్య సత్యాన్వేషకులు, పరమార్థాన్వేషకులు తాను చెప్పిన యర్థమే సర్వాంగీకార్యమని భావించునట్టివారు కారు. కాబట్టి యిందు వితండ వాదములు లేవు.

చదవరుల హృదయము నాకర్షించుచు సహకరించు ప్రతి పాదనలు, పాదటిప్పణములు, వివరణములు, విషయానుక్రమణి కలు ఇందు పరిపూర్ణమై యున్నవి. వివిధ దర్శనములను సంగ్ర హించి, వాటికిని భగవద్గీతా ప్రతిపాద్య విషయమునకును గల సామ్య వైషమ్యములను చర్చించి తెల్పి భగవద్గీతకు గల ఉత్కృ ష్టతను నిరూపించుట ఇందలి ప్రత్యేకత. ధ్యానయోగ మీవ్యాఖ్యా తకు కరతలామలకము. ధ్యానానుష్ఠానమందు ఈ వ్యాఖ్యాత నిష్ణాత

కావున ఇందలి ధ్యానయోగ వివరణము ప్రసన్న గంభీరముగ ప్రీతి పాత్రమై యున్నది.

అరవిందయోగి వలెనే ప్రణవానందస్వామియు జ్ఞానయోగ భక్తియోగ, కర్మయోగ, ధ్యానయోగములందు ఒక్కొదానిని మాత్రమే ప్రతిపాదించి తక్కిన వానిని త్రోసివేయు పాక్షిక సిద్ధాంతమును నిరసించెను. భగవద్గీత ఈ నాల్గు యోగములను సమన్వయించుటయేకాక ప్రపంచమందలి అన్ని ముఖ్యమతముల లోను చెప్పబడియున్న యోగములను గూడి సమన్వయించునని వీరు చేసిన నిరూపణము సమంజసమైనది.

"మొత్తము మీద భగవద్గీత పారిమార్థిక జ్ఞానముతోను, భక్తితోను, ఏకాగ్రత తోను గూడి నిష్కామ కర్మాచరణమును బోధించును. అదియే కర్మయోగము. కర్మయోగము. అయినప్పటికిని కర్మయోగము, జ్ఞానయోగము. భక్తియోగము, ధ్యానయోగము — ఒక్కొకటియు దేనికది భగవత్ప్రాప్తికి పరమపదమునకును స్వతంత్ర మార్గము వీనిలో ఒకటి ప్రధానమైనప్పటికిని మిగిలిన మూడు యోగములు అంగములుగ నుండియే తీరును." ఇది ఈ వ్యాఖ్యాత గావించిన నిర్వాహము సాధకుని చిత్తవృత్తిపై సమస్తము నాధారపడి యుండును.

ఈ కాలమున కొందరు సన్న్యాసులు కర్మానుష్ఠానము కంటె కర్మత్యాగమే శ్రేష్ఠమనుట భగవద్గీతాశయమని వాదించు

చున్నారు. ఈ వ్యాఖ్యాత ఆ వాదమును నిరసించుటయేగాక అర వింద యోగివలె, తిలకు మహాశయులవలె భగవద్గీత ఒక ప్రాంతమునకు చెందినదికాని. ఒక కాలమునకు చెందినదికాని కాక సార్వకాలికము, సార్వభౌమికమునగు గ్రంథరాజమనియు ప్రతిపాదించినాడు.

దృతరాష్ట్రుడు, విదురుడు, దుర్యోధనుడు మొదలగు వారికి చూపిన విశ్వరూపమునకును భగవద్గీతలో కురుక్షేత్ర సంగ్రామ మధ్యమున శ్రీకృష్ణభగవానుడు అర్జుననకుచూపిన విశ్వరూపమున కును గల భేదములను సహృదయ హృదయాహ్లాకరముగను సతర్కముగను నిరూపించిన వీరి నిరూపణము స్వతంత్రమనుటలో ఏ సందేహమునులేదు. వైశ్యులుగను, శూద్రులుగను, స్త్రీలుగను జన్మించుట పాపఫలితమనెడి జాత్యహంకారవాదమును వీరు ఖడిం చిరి. దీనిని బట్టి ఈ గ్రంథము ఉదారాశయసంపన్నమని నిరూపించ వచ్చును.

శ్రీ భగవద్గీత బ్రహ్మసూత్రముల కంటె అర్వాచీనమని కొందరు వాదించుచున్నారు. రచయిత దానిని పూర్తిగా ఖండించిరి. అటువంటి దేశకాల విప్రతి పత్తులు ఇందులో లేవు. మొత్తము నకు నిత్య సత్యాన్వేషణయే పరమార్థముగా గలవారిచే పరమార్థా

న్వేషకుల నుద్దేశించియే వ్రాయబడినది గ్రంథము. "సద్గ్రంథము తత్కర్తయొక్క హృదయరక్తమనుట నిత్య సత్యము."

చిలకమర్తి నరసింహం, B. A. L. T.
రాజమండ్రి 1936



## అనుబంధము 8

## శ్రీ ప్రజ్ఞానానందస్వామివారి ప్రస్తావన, శ్రీ ప్రణవానందుల భగవద్గీతకు

నానావిచిత్రశక్తి శోభితమును దేశకాల కారణ పరివ్యాప్తమునగు నీ విశ్వము అశ్వత్థావ్యయసనాతన రూపముగ శ్రుతి స్మృతులందు పేర్కొనబడినది. ఈ సువిశాల విశ్వము యొక్కయు, మానవాళి యొక్కయు దివ్యాభ్యుదయము ధర్మమూలమై యున్నది. "అభ్యుదయ నిశ్శ్రేయస కరోధర్మః" "ప్రజా ఉప సర్పంతి ధర్మేణ" జగన్నియామకాభ్యుదయకర ధర్మములకు బ్రహ్మనిశ్శ్వాసమైన వేదములే మూలము – "బ్రహ్మనిశ్శ్వసితం వేదాః" అపౌరుషేయములైన వేదములు మంత్రద్రష్టలగు మహాఋషుల ద్వారమున మనకు పరంపరగా ప్రాప్తములు.

వేదము లనంతములు అట్టి వేదముల నభ్యసించి ధర్మబద్ధమైన జీవిత ధర్మాచరణము సల్పవలెనన్న జీవితమున కాలము చాలదు.

"అనన్త శాస్త్రం బహు వేదితవ్యం అల్పశ్చకాలో బహవశ్చ విఘ్నాః। యత్సార భూతం తదుపానితవ్యం హంసో యథా క్షీరమివాంబు మిశ్రమ్॥" ఉ గీ 3. 1.

ఈ న్యాయము ద్వాపర యుగాంత సంధి సమయమున కురుక్షేత్ర మహాసంగ్రామ ప్రారంభమున విషణ్ణుడై ధర్మసమ్మూఢ చేతస్కుడైన అర్జునునిగూర్చి శ్రీకృష్ణ భగవన్ముఖ నిర్గత గీతామృత ప్రబోధమునకే జెల్లును. ఇయ్యది సర్వవేదసారమును సర్వధర్మ సారమునై యొప్పుచు లోకమున "శ్రీమద్భగవద్గీతా" నామము ప్రసిద్ధమై బహుదేశ భాషలందు ప్రచారితమై మానవాళికి ఇహపరానంద సంధాయకమై యొప్పుచున్నది

"సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః।
పార్థో వత్సస్సు ధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్॥"

శ్రీమద్భగవద్గీత మోక్ష ధర్మ ప్రబోధకమైన మత గ్రంథము మాత్రమే కాదు. భగవద్గీత ఏక దేశీయమును, ఏక కాలీనమునుగాక సర్వకాల సర్వదేశ సర్వావస్థలందును వర్తించు మానవాళికి వ్యక్తిగత సాంఘికాభ్యుదయకర నిత్యనైమిత్తికాది

ధర్మ జీవన ధర్మములను, పరమ నిశ్రేయస మోక్షధర్మములను గూడ ప్రబోధించుచు, సర్వజనాదరణీయమును సర్వజనాశ్రయము నైన సర్వోత్కృష్ట గ్రంథరాజమై విరాజిల్లు చున్నది.

"ఏకం సద్విప్రాః బహుధా వదన్తి" అను శ్రుతి వచనామసారము జగదాధారమైన అనంత అద్వయాఖండ సచ్చిదానంద పరబ్రహ్మతత్త్వమును భిన్నదృక్పథ సిద్ధాన్తప్రబోధకులైన అష్ట మతాచార్యులు భిన్ననామముల పేర్కొనిరి.

శ్లో॥ యంశైవాః సముపాసతే శివ ఇతి బ్రహ్మేతి వేదాన్తినో।
బౌద్ధా బుద్ధ ఇతి ప్రమాణపటవః కర్తేతినైయ్యాయికాః।
అర్హన్నిత్యథ జైనశాసనరతాః కర్మేతిమీమాంసకాః।
సోఽయం వో విదధాతు వాంఛితఫలం త్రైలోక్యనాథోహరిః॥

ప్రఖ్యాత మతాచార్యులైన శ్రీమచ్ఛంకర భగవత్పాదులు, శ్రీమద్రామానుజాచార్యులు, శ్రీమన్మధ్వాచార్యులు, మొదలగు మహాపురుషులు శ్రీమద్భగవద్గీత యొక్క విశిష్టతను గుర్తించి వారి వారి సిద్ధాంతముల నీ గీతయందు గాంచి ప్రతిపాదించుచు విపుల భాష్యములను లోకకళ్యాణార్థమై రచించిరి. ఆధునిక కాలమున శ్రీ బాలగంగాధర తిలక్ మహాశయుడును, శ్రీ అరవింద యోగియు, మరెందరో సజ్ఞానఘనులు భగవద్గీతకు టీకలు, వ్యాఖ్యానములు వ్రాసి లోకమునకందించిరి. భగవద్గీతకు వ్యాఖ్యానములు వ్రాయుటలో వ్యాఖ్యాతల ప్రతిభయు, మత సిద్ధాంతమును వెల్లడి

యగుటయే గాక గీతా వ్యాఖ్యానమునింతనే వ్యాఖ్యాన కర్తకును, వారి సిద్ధాంతమునకును ఎనలేని కీర్తియు శోభయు ప్రాప్తింపను.

ఇక ప్రకృత వ్యాఖ్యాన ప్రస్తావన, ఈ గీతా వ్యాఖ్యాత "శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యస్వామి ప్రణవానంద యతీంద్రులు శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య అవధూత వర్య పరమపూజ్యపాదస్వామి జ్ఞానానంద యతిచంద్రుల అంతే వాసియు, మాకు సతీర్థ్యులును, అగుట విశేషము. శ్రీమత్ ప్రణవానందస్వామి పవిత్ర గోదావరీ నదీతీరమున సాంప్రదాయక వైదిక కుటుంబమున జనించి బాల్యము నుండియు పరమార్థచింత నులై యౌవ్వనమున పంజాబులోని లాహోరు నగరమున మాననీయ లాలాలజపత్‌రాయుగారిచే నెలకొల్పబడిన డి. ఏ-వి. కాలేజీలో పట్టభద్ర విద్యను ముగించుకొని మహాత్మగాంధీ నాయకత్వమున నిర్వహింపబడుచున్న భారతస్వాతంత్రోద్యమ మున బహిరంగముల 1919 మొదలు 1926వ సంవత్సరమువరకు నిస్వార్థతతో మాతృదేశ సేవనొనర్చి, పిదంపిదిం ఆత్మాభిముఖులై, ఆత్మ సాక్షాత్కార తీవ్ర ప్రతిజ్ఞానతో అస్మద్గురు శ్రీమత్ పూజ్య స్వామి జ్ఞానానంద చరణ సన్నిధికిజేరి శ్రీవారి దివ్యానుగ్రహ మును బడసి "అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా హిమాలయో నామనగాధి రాజః!" అను జగస్ప్రఖ్యాత పవిత్ర హిమాలయ తపోభూములందును — హృషికేశము, గంగోత్తరి, బదరికాశ్ర మము, కాశ్మీరము మొదలగు పుణ్యతీర్థ రాజములందును, మానస సరోవర కైలాస శిఖరాగ్రకందరములందును — 25 వత్సరముల

తీవ్ర తితీక్ష దీక్షలతో బహువిధాధ్యాత్మిక, యోగజ్ఞాన సాధనలను
తపోనిష్ఠను సల్పి అఖండాద్వయ సచ్చిదానంద పరబ్రహ్మను
భూతిని బడసిన మహితాత్ములు. ఇంతియేగాక శ్రీమత్ ప్రణవా
నందస్వామి బాల్యముననే శ్రీమచ్ఛంకర విరూపాక్ష పీఠాధిపతులగు
శ్రీమత్ పూజ్యపాద నృసింహభారతిస్వామివారి యనుగ్రహ
మున శ్రీవిద్యోపాసనను బడసి, ఆ మహావిద్యామంత్ర సాధ
నము సల్పుచు పూర్ణదీక్షాపరులైరి. ఇటుల సగుణ నిర్గుణ పర
తత్త్వానుభవలబ్ధి నొందిన ధన్యాత్ములు. మరియు శ్రీమత్ ప్రణవా
నందస్వామి గత అర్ధశతాబ్దమున పవిత్ర హిమాలయ తపోభూము
లందు ఆధ్యాత్మిక సాధనలను సల్పుటయేకాక అందలి దివ్యక్షే
త్రములయు, తీర్థ రాజములయు, ప్రదేశములయు, చారిత్రిక,
భౌగోళిక, వాతావరణ పరిశోధనాదులను సల్పి, బహువిధ వ్యాస
ముల సంపుటీకరించి గ్రంథములు రచించి ప్రభుత్వమునకు, పరి
శోధకులకు ప్రజానీకమునకు నెనలేని సేవగావించి గౌరవము
నొందిన చరితాత్ములు.

ఇట్టి బహుముఖప్రజ్ఞా ప్రాభవమూర్తులైన శ్రీమత్ ప్రణవా
నంద యతీంద్రులు గత అర్ధశతాబ్దియందు అకుంఠిత విరతితో
కర్మ, భక్తి, యోగ, జ్ఞానోపాసనా మార్గముల తాము సల్పిన
ఆధ్యాత్మిక సాధనానుభవ బలమునను, అర్ష దర్శనపరిశోధనాను
భవబలమునను, శ్రీమద్భగవద్గీతకు వ్యాఖ్యానము వ్రాయుట పర
మార్థ సాధకులకును, సుధీమణులకును జనాళికిని, ఇహపరాభ్యు
దయానంద సంధాయకమై యొప్పుననుటలో నెట్టి సందియములేదు.

పూర్వ వ్యాఖ్యానములు ఏదియో యొక మతసంప్రదాయము నకు, దృక్పథ సిద్ధాంతమునకు జెందినవై యున్నవి.

శ్రీమద్భగవద్గీత యందన్ని దృక్పథ సిద్ధాంతములకు తావుండుటచే ఆయా మహిమాన్విత వ్యాఖ్యానములు గౌరవస్థానము నాక్రమించుచునే యున్నవి. "యేయథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహం। మమ వర్త్మాను వర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః॥" అని శ్రీకృష్ణ భగవానుని ప్రతిజ్ఞయే. ప్రకృతమున శ్రీమత్ ప్రణవానందస్వామి వ్యాఖ్యానమునందట్లు, నిష్పాక్షిక దృక్పథముతో మూలము ననుసరించి అచ్చటచ్చటి ప్రసంగ యథార్థ్యమును తమ సాధనాక్రమస్వానుభవమును, శ్రుతి, స్మృతి. దర్శన, పురాణేతిహాసాది గ్రంథ పరిశోధనానుభవమును, జతప ఱచి వివరించుచు, సందర్భోచిత గ్రంథప్రమాణముల నుల్లేఖిం చుచు, తమ గీతావ్యాఖ్యానమును ఆదినుండి అంతము వఱకును కడు సావధాన చిత్తముతో సాగించి, సాధక, పాఠకలోకమునకం దించుటెంతేని ముదావహము.

మహాత్ములు రసమయదృష్టి గలవారు. రససిద్ధులుగూడ. వారి ప్రతిభకు హద్దు పద్దుండదు. బ్రహ్మ సృజించిన ప్రాణి కోటికి పరిమితాయువుండవచ్చును. రసమయ దృష్టిగల మహా త్ములు సృజించిన అనుభవములకు కాలపరిమితిలేదు, మహాత్ముల సారస్వత మేనాటికిని నశింపక ఆచంద్రార్కము విరాజిల్లుచుండును. ఋతువులు మారిన మారవచ్చునుగాక ; కాలము తన ధర్మము

నంతయు కూడగట్టుకొని విఱచుకొని పడిన పడుగాక ! మహా త్ముల సారస్వతమేనాటికిని చెక్కుచెదరనిది. నిత్యనూతనము, వారు సార్వకాలికము, సర్వాబాధితమునగు సారస్వతమును సృష్టించి లోకమందు వైశిష్ట్యమును బొందుదురు స్వామిప్రణవానందుల సారస్వత సృష్టియు అట్టి వైశిష్ట్యము గలది

శ్రీమద్భగవద్గీతయే సర్వధర్మసారమనిగదా ప్రఖ్యాతి. ఇక శ్రీమత్ ప్రణవానందస్వామి వారి వ్యాఖ్యాన వివరణము గూడ స్వానుభవజన్యమైన సర్వశ్రుతి శాస్త్ర పురాణేతిహాస ధర్మసార సంపుటీకరణమేయై యొప్పుననుటలో నెట్టి సందియములేదు. పర మేశ్వర పరాశక్తి పూర్ణప్రసాదలబ్ధ ప్రమోదమే శ్రీమత్ స్వామి ప్రణవానంద యతీంద్ర వ్యాఖ్యానమునకు సారథియై నిల్చి యీ వ్యాఖ్యను లోకకల్యాణార్థమై ప్రసాదించెనని నా దృఢ విశ్వాసము. దైవప్రసాదరూపమైన ఈ వ్యాఖ్యానామృతమును ఎల్లరును సేవించి ఇహపరనిశ్శ్రేయసరసానందానుభూతి నొంది తరింతురుగాక.

| చిదానందాశ్రమం, | ఓం నారాయణ స్మరణ, |
| --- | --- |
| పశివేదల. | |
| పశ్చిమగోదావరి. 8-3-1973. | స్వామి ప్రజ్ఞానానంద. |

# అనుబంధము 9

## శ్రీ ప్రణవానందస్వామి భగవద్గీతకు దోర్బలపు శోభనాద్రిశాస్త్రిగారి విజ్ఞప్తి

హిమాలయమునుండి కన్యాకుమారి వరకు విస్తరించినదియు, స్వర్గాపవర్గమార్గమనదగినదియునగు భారతవర్షమున సనాతన ధర్మము నవలంబించు వారికి పట్టుగొమ్మ శ్రీ భగవద్గీత. ప్రస్థానత్రయములో భగవద్గీతయొకటి. ఇది ప్రపంచమందన్ని భాషలలోనికి అనువదింపబడి యున్నది. ఇందలి గంభీరార్థములను వివరించుచు ఆదిశంకరుల మొదలు కొని పలువురాచార్యులు భాష్యములను, వ్యాఖ్యానములను రచియించి యున్నారు.

శ్రీ భగవద్గీతయందు ప్రపంచధర్మముల సమన్వయము కాననగును. శ్రీకృష్ణభగవానుడు ప్రతిపాదించిన ధర్మస్వరూపము, దార్శనిక మార్గమున కన్నను విశిష్టమై విశ్వవ్యాప్తమైనది. ఇట్టి మహోదారధర్మసమన్వయరూపమైన సందేశమును బోధించు వ్యాఖ్యానములు తెలుగులో తక్కువ. ప్రతి పదార్థ తాత్పర్యములు వివరించు గ్రంథములు ఎన్నియో గలవు. సాధారణస్థాయిలో నుండు వారి కవిగోచరములు కావు. సంస్కృత భాషలో నెట్టి ప్రవేశములేని సామాన్య పాఠకులకు గూడ సర్గమగు రీతిలో, 'శ్రీ జ్ఞాన దీపిక' యను నీ వ్యాఖ్యాన గ్రంథము చక్కగా రూపొందించినది. ఇందు మూల శ్లోకములు, శ్లోకావతారికలు, ప్రతి పదార్థములు,

తాత్పర్యములు, పలుచోట్ల నెల్ల సరళభాషలో విపులమైన వ్యాఖ్యలు టిప్పణములు, షడ్దర్శనముల సారములు, వాటికిని భగవద్గీతకును గల తారతమ్యములు, వాటికంటె గీతకుగల ఉత్కృష్టతయు మొదలగునవి కలవు. వ్యాఖ్యానమతిగంభీరము గను, కడు సరళముగను నున్నది.

భగవద్గీతకు 'జ్ఞానదీపిక' యను నీ వ్యాఖ్యానము రచిను యించినవారు శ్రీ ప్రణవానందస్వామి. వారు ఉన్నతులు, గంభీరులు. ఔన్నత్యమునకు పేరుపొందినది హిమాలయపర్వతము. అది ఇడివానలకు జంకదు. పడగళ్ళకు పడకిపోదు. తుపానులకు తూలిపోదు. అట్లే జీవనస్రవంతిలో ఎన్ని ఒడిదుడుకులేర్పడినను అత్యున్నతమై, శాలమైన దృక్పథముతో వీరు తామనుకొనిన పథమునుండి ఒక్క అడుగైనను చలింపని ధీరులు. హిమాలయముతో సమానులు. వారి ఉదాత్తత వాచామగోచరము. అట్లు లెక్కింపదగినవారైన మహనీయులలో శ్రీ ప్రణవానందస్వామి పేర్కొనదగినవారు.

హంసలు, మానస సరోవరవాసము వదలి కొన్ని ఋతువులలో, పలు సరోవరములకు పలు దేశములకు వలసపోవుచుందురు తమను ప్రయాణములో నెపి యెన్నటికిని అలసిపోవు. ఎన్ని చోట్లకు వలసవెళ్ళినను, ఎన్ని దేశములు చుట్టినను తిరిగి అవి యన్నియు స్వస్థానమైన మానసౌకమును చేరుచున్నవి. అట్లే శ్రీ ప్రణవానందస్వామి హంసలలో పరమహంసవంటివారు. చిన్ననాటినుండి సత్యాన్వేషణతత్పరులగుటచే తపస్సులో, ధ్యానములో మునిగి

సంవత్సరములో ఎక్కువ కాలము హిమాలయముల ఒడిలో ఆధ్యాత్మికసాధనాతత్పరులై యుండి. అప్పుడప్పుడు నూత్న విషయాన్వేషణకై సంచరించుచుందురు. సంచారము ముగియగనే వారు మరల పవిత్రహిమాలయములు చేరుకొందురు. వారు బహుజనహితాయ బహుజనసుఖాయ జన్మించిన కారణజన్ములు. నిష్కామసేవామార్గములో అమృతత్త్వమును సాధించిన మహనీయులు. నిష్కామసేవయే శ్రీకృష్ణభగవానుడు చెప్పిన కర్మయోగము. నిష్కామసేవయే గొప్ప తపస్సు. అది అన్నింటియందు సమబుద్ధిగల వారికి తప్ప ఆచరణసాధ్యము కాదు. అరిషడ్వర్గమును అదుపులోనుంచుకొన్నవారికి తప్ప అందుబాటులో నుండదు. సమబుద్ధి ఇంద్రియజయము సాధింపగలిగిన శ్రీ ప్రణవానందస్వామి విషయమున ఆ తపస్సు ఆచరణలోనికి వచ్చినది.

శ్రీ ప్రణవానందస్వామి హృదయము తపోనిలయమగు పవిత్ర హిమాలయముల వంకకు 1918 వ సంవత్సరముననే ఆకర్షింపబడినది. పరమేశ్వరుని నివాస స్థానముగా, దేవభూమిగా పావన భాగీరథీసింధు బ్రహ్మపుత్రా సట్లెజ్ (శతద్రు) నదీనిలయముగా పేరుపొందిన హిమాలయముల ఆధ్యాత్మికజీవితమును నెఱపుచు వీరు అందేనిలబడిపోయిరి. వీరు, కైలాసమునకెదురుగ మానస సరోవర దక్షిణతీరమునగల ఒక ఆశ్రమమున స్థిరనివాసమును కల్పించుకొనిరి. కావుననే శ్రీ ప్రణవానందస్వామి 'కైలాస-మానస సరోవర తీరవాసి' యని అన్వర్థ ప్రశస్తి గాంచిరి,

వేలకొలది సంవత్సరములనుండి రజతాద్రియనంబడు కైలాస శిఖరమును, బ్రహ్మమానసమని చెప్పబడు మానససరోవరమును హిందూ ధర్మమును పాటించు భారతీయులకును, బౌద్ధ ధర్మావలంబకులగు టిబెట్టు మొదలైన దేశముల వారికిని మొత్తము సుమారు తొంబదికోట్ల ప్రజలకు సర్వోత్కృష్టతీర్థ రాజములై వెలయుచున్నవి. కైలాసము చుట్టుకొలత 32 మైళ్లు, మానససరోవరము చుట్టుకొలత 54 మైళ్లు, శ్రీ ప్రణవానందస్వామి అంతటి కైలాస మానససరోవరములకు ముప్పదిమూడు పర్యాయములు ప్రదక్షిణము చేసిరి. అన్ని సారులు ప్రదక్షిణము చేసిన వారి కార్యదీక్ష అచంచలమైనది. శీతాకాలమున నీరు గడ్డ గట్టుటకు 52½F. డిగ్రీల క్రిందుగా అత్యల్పతరతాప ప్రమాణము గల సరోవర ప్రాంతముననే దీక్ష వహించి 25 చాతుర్మాస్యాలు అందీ గడపిరి. వారి కైలాస - మానస యాత్రలు 1926 లో ప్రారంభమయ్యెను. 1921 వ సంవత్సరముననే వారికి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ 108 జ్ఞానానందస్వామివారి పరిచయభాగ్యము కలిగినది. శ్రీ జ్ఞానానందస్వామి ఆధ్యాత్మికౌన్నత్యమును సాధించిన అఖండ తపస్వులు 'పూర్ణసూత్రముల'ను గ్రంథమునకు రచయిత. వారిని తమ గురుదేవులుగా వరించి, వారి సహాయమున ఆధ్యాత్మిక సాధనలు సాగించి వారినుండి 1962 లో దీక్ష గైకొనిరి. రాజకీయములలో సంబంధమును వదలి ఆనాటినుండి నేటిదాక ఆధ్యాత్మిక విషయాసక్తులై నిత్యసత్యాన్వేషణ పరులై లోకసేవయే పరమార్థముగ గలిగియున్నారు. వీరు గావించిన పరిశోధనలను, సాధన

లను గురించి గ్రుచ్చుచు పెక్కు గ్రంథములను రచియించియున్నారు. వారి గ్రంథములలో ముఖ్యమైనవి.

1. Exploration in Tibet (టిబెట్టులో అన్వేషణ) కలకత్తా విశ్వవిద్యాలయము వారి ప్రచురణము. (రెండుమార్పులు అయినవి).
2. Kailas - Manasarovar (ఆంగ్లములో).
3. కైలాస - మానస సరోవర్ (హిందీలో) రెండవ మార్పు.
4. (తెలుగులో) అచ్చుగుచున్నది.
5. శ్రీ భగవద్గీతకు 'శ్రీ జ్ఞానదీపిక'యను విపులాంధ్ర వ్యాఖ్యానము, దీని రెండవ ముద్రణ, (ఎండోమెంటు డిపార్టుమెంటు, అచ్చు వేయించుచున్నది.)
6. గాయిత్రీ మంత్రార్థ వివరణము.
7. ఆధ్యాత్మిక స్పందనము (Spiritual Vibration).
8. కస్తూరి - కస్తూరి మృగము. (Musk and Muskdeer).
9. A Tratise on Srichakra. (శ్రీచక్ర సర్వస్వము) నేషనల్ మ్యూజియము న్యూఢిల్లీ అచ్చువేయుటకు పూనుకున్నది.
10. Roopkund Mystery Solved (రూప్‌గుండ రహస్య నిర్ణయము).
11. The Abominable Snowman (హిమమానవరహస్యము).
12. Galloping Iconographic Survery of Kumaun (కుమాయూం, కూర్మాచల - విగ్రహ పర్యవేక్షణము).

ఇంతటి గొప్ప తపోధనులగు శ్రీ ప్రణవానందస్వామి ఆంధ్రులు. వారి పుట్టుపూర్వోత్తరములను గూర్చియు వారి సాధనలను గూర్చియు విశేషముగా నెరుగుట మనకందరికిని కర్తవ్యమై యున్నది. వారి జీవిత సంగ్రహమిది. పూర్వాశ్రమమున శ్రీ ప్రణవానందస్వామి పేరు కనకదండి వెంకటసోమయాజులు వారిది మహోన్నత విద్యత్కుటుంబము. వారి కుటుంబమునకు మూలపురుషులు లక్ష్మణశాస్త్రిగారు. శాస్త్రములందును లౌక్యవ్యవహారములందును, దక్షులగు శ్రీ కనకదండి వెంకటసోమయాజులు గారు వారి పితామహులు, ధర్మశాస్త్రముల నాపోశనము పట్టిన వారును, జ్యోతిశ్శాస్త్రమందఖండ ప్రజ్ఞ గడించినవారును. శ్రీకనకదండి గోపాలకృష్ణశాస్త్రి వారి పెత్తండ్రి, గొప్ప సంస్కృత పండితులు ప్రఖ్యాత శాస్త్రవేత్తలగు శ్రీ ఇంద్రగంటి విశ్వపతిశాస్త్రిగారు వారి తాతగారికి మాతామహులు. శ్రీ కనకదండి గోపాలకృష్ణశాస్త్రి గారి మామగారగు శ్రీ భాగవతుల హరిశాస్త్రులవారు మహావైయాకరణులు, వారు వ్యాకరణ మహాభాష్యమునకు రచించిన వ్యాఖ్యానమిప్పటికిని వారణాశీ సంస్కృత విద్యాలయములలో పఠన గ్రంథమైయున్నది. వీరి పినతాతగారు (తాతగారి సహోదరులు) సన్యాసదీక్షను స్వీకరించినవారు. వారి కుటుంబములోనివారందరు విజయనగరసంస్థాన పండితులు. ఆంధ్రదేశమున కింతటి త్యాగమూర్తిని ప్రసాదించిన సీతమ్మవారితల్లి. శ్రీ కనకదండి విశ్వపతిశాస్త్రి వారి తండ్రి నిరతాన్న ప్రదాత. వీరు ఇంతటి మహోన్నత సంప్ర

దాయక కుటుంబమున దుర్ముఖినామ సంవత్సర మాఘశుద్ధ పాడ్యమి నాడు 1896 వ సంవత్సరము, జనవరి 14 వ తేదీని జన్మించిరి.

శ్రీ ప్రణవానందస్వామి బాల్యము నుండియు అకుంఠిత దీక్ష, దేశభక్తిగలవారు. బ్రిటిషువారు దేశమంతట మిషనరీ స్కూళ్లు పెట్టుట సాధ్యమైనంతవరకు భారతీయులను క్రైస్తవ మతములోనికి మార్చుటకు వారి చదువులు నేర్పు రోజులవి. వారి విద్యాలయములు గుమాస్తాలను, తయారు చేయునేకాని జాతీయ వీరులను తయారుచేయలేవు జాతీయ దృక్పథములేని ఆ విద్యాలయములలో చదువు సాగించుట కిష్టపడక శ్రీ కనకదండి వెంకట సోమయాజులు, వారి వంటి దృక్పథముతో నేకీభవించిన శ్రీ ముదిగంటి జగ్గన్నశాస్త్రిగారు మొదలైన మిత్రులతో గూడి, లాలాలజపత్‌రాయ్‌గారి ప్రోత్సాహమున స్థాపింపబడిన 'నేషనల్ కాలేజి'లో చదువుటకై పంజాబుకు వెళ్లిరి. అఖిలభారత స్థాయిలో స్థాపింపబడి వాస్తవ దేశభక్తులను రూపొందించు సంస్థ అది. పంజాబు విశ్వవిద్యాలయమునకు చెందిన లాహోరులోని ఆ. డి. ఏ-వి. కళాశాలలో చదివి 1919 లో వారు పట్టభద్రులైరి.

శ్రీ ప్రణవానందస్వామి సంఘసేవయందేమరలేదు. 1918 లో గఢ్వాల్ జిల్లాలో కరువులు వచ్చి ప్రజలు మల మల మాడుచుండిరి. స్వామి చదువుచుండిన కళాశాలాధికారులు సహాయ కార్యక్రమమొకటి ప్రారంభించి క్షామ నివారణార్థమై స్వామి నచ్చటికి పంపిరి. వారి ఆదేశముపై స్వామి, వాలంటీరుగా

అక్కడికి వెళ్లి పల్లె పల్లెలా వాడ వాడలా చుట్టి అందరికి ఆహార ధాన్యములను పంచిపెట్టిరి. ఇట్లు కరువు కాటకములను నివారించుట యందు తోడ్పడి ఆదర్శ ప్రాయముగ సంఘసేవ గావించిరి. వారికి హిమాలయముతో సన్నిహిత సంబధమేర్పడిన దాసమంతమందే.

కాంగ్రెసు సంస్థ అసహాయోద్యమమును ముమ్మరముగా ప్రచారము చేయుచున్న రోజులవి. వారి ఆశయములు ఆదర్శ ములు శ్రీ ప్రణవానందస్వామి చిరుహృదయము నాకర్షించెను. వారు చిన్ననాడే అనగా 1915 లోనే కాంగ్రెసులో అకుంఠిత దీక్షతో స్వయముగా పనిచేసెడి కార్యకర్తగా చేరిరి. అమృతసరమున జలియనువాలా బాగ్ దురంతములు పంజాబులో జరిగిన సందర్భ ములో వారును కాంగ్రెసు ఆదేశమును పాటించి సత్యాగ్రహ సమర ములో దూకిరి. 1919 లో పంజాబునందు 'మార్షల్‌లా ఆర్డినెన్సు' ప్రకారము బాధితులైన వారిలో వీరు ఒకరు.

1919 మార్చి - ఏప్రిల్ నెలలలో 'రౌలతు చట్టము' వచ్చినది. లాహోరు నగరమున 'మార్షల్ లా' అమలులోనుండెను. లాహోరిగేటు దగ్గర బ్రిటిషు సైనికులు హిందూ – మహమ్మదీ యుల గుంపులపై రాత్రి 9-30 గంటలప్పుడు నిర్విరామముగా కాల్పులు జరిపించిరి. గుండు దెబ్బలు తగిలి ఎంతోమంది హిందు వులు, పఠానులు మరణించిరి. రక్తము వరదలై పారెను. అప్పుడు స్వామి వారికి రొమ్ము కుడివైపున పిచ్చుకత్తి (బయోనేటు)

గ్రుచ్చుకొని గాయములు ఏర్పడినవి. వాడు అనార్కలిలోని ఆర్య సమాజమందిరములోనికి వెళ్లి ఆ పరిస్థితిని తప్పించుకొనవలసి వచ్చెను. అంతటితో ఆగిపోలేదు. కళాశాలలలోని విద్యార్థులు, హైస్కూళ్లు కాలేజీలలోని విద్యార్థులు అందరు దినమునకు నాలుగు పర్యాయములు అటెండెన్సు పేరేడుతో హాజరు అయి తాము వచ్చి వట్లు నిరూపించుకొనవలెనని మిలిటరీ అధికారుల శాసన. స్వామి వారు చదువుచుండిన డీ. ఏ.వి కళాశాల విద్యార్థులు కూడా బ్రాడ్లా హాలు మైదానములో హాజరు చెప్పుకొనవలసి యుండెను. అప్పుడు బ్రిటిషు సైనికులు నలువైపుల నిలబడి విద్యార్థులపై మెషీను తుపాకులు గురిచేసి కందకములలో బారులు తీరి యుండిరి. ఏ కొంత వ్యత్యాసము కలిగినను విద్యార్థులు కాల్పులకు గురియగుచుదురు.

ప్రణవానందస్వామి కళాశాల చదువు ముగిసిన పిదప కొద్దికాలము లాహోరులో ఉన్న నార్త్ వెస్టర్ను రైల్వే అక్కౌంటుఆఫీసులో ఉద్యోగము చేసిరి. తర్వాత ఆ చోటును విడిచి పశ్చిమగోదావరి జిల్లాలో 1920 నుండి 1926 వరకు గాంధీ శంఖారావమును విని అనసహాయోద్యమమునందు పాల్గొని సత్యాగ్రహము చేసిరి. వారు కాంగ్రెసు సంస్థలో చేరి నిరంతర సేవాతత్పరులై తమ విధులను నిర్వహించుచుండిరి. పశ్చిమగోదావరిజిల్లా ఖద్దరు శాఖలోను, హరిజన సంక్షేమ కార్యవిభాగమునను రెండింట వారొనాడు గావించిన సేవ సాటిలేనిది. ఆంధ్రదేశమున తణుకు నందు గల

'జాతీయోన్నత విద్యాలయము'లో స్వామియే మొట్టమొదట హిందీ తరగతులను ప్రారంభించిరి 1923 లో కాకినాడయందు అఖిలభారత కాంగ్రెసు సమావేశము జరిగెను. అప్పుడు వారు వాలంటీర్ల దళమునకు దళనాయకులై పనిచేసిరి.

శ్రీ ప్రణవానందస్వామి మొట్టమొదట పర్యాయము కైలాస - మానససరోవరములను చుట్టివచ్చి 1928 వ సంవత్సర డిసెంబరులో లాహోరు నగరమందాగిరి. వారు అక్కడ ఉన్నప్పుడే భగత్సింగు, సాండర్సు అను పోలీసు సూపరిండెంటును డి. ఏ. వి. కళాశాలావరణ నుండి పిస్తోలుతో కాల్చి చంపెను. సాండర్సును కాపాడబోయిన చందనసింగ్ అను హెడ్ కానిస్టేబులు కూడా తీవ్రమగు గాయములకు గురియయ్యెను. భగత్సింగును, అతని స్నేహితులును డి ఏ. వి. కళాశాలావరణలగుండా పలాయన మంత్రమును పఠించిరి. కావున, పోలీసులు కళాశాలకు చెందిన విద్యార్థులందరిపై నిఘఈక్షణ పెట్టిరి. ఆ సందర్భముగా లాహోరు నందున్న స్వామి మీద కూడ పోలీసుల నిరీక్షణ ఏర్పడెను. అక్కడ నుండి కాశ్మీరమునకు వెళ్లిరి. అక్కడ కూడ పోలీసుల పర్యవేక్షణలో మెలగవలసినవారైరి. అమరనాథ్ మంచు గుహలో వారు పదిహేను రోజులు ఏకాంతవాసము చేసిరి. దానితో వారిమీద నమ్మకము కుదిరి, పోలీసుల పర్యవేక్షణను తీసివేసిరి.

ఆధ్యాత్మిక ప్రేరణము వారి జీవితమును పెనవేసుకున్నది. ఆధ్యాత్మిక ప్రేరణ వలన వారు హిమాలయ ప్రాంతములకు

వెళ్లిరి. అకుంఠిత దేశభక్తి అప్పటికి వారిని వదలలేదు. సన్యాస దీక్షస్వీకారమైన తరువాత గూడ సంవత్సరములో కొంతకాలము హిమవత్పర్వత ప్రాంతములు చుట్టి గిరిజనులలో చైతన్యము కలిగించుచు కాంగ్రెసు సంస్థ యొక్క ఆశయములను గూడ ప్రచారము చేయుచుండిరి. 1942-43 లలో స్వాతంత్ర్యాభిరతి ప్రజలలో తీవ్రతరమై భయంకరవిపత్కర పరిస్థితులేర్పడిన సమయమందు గూడ వారు తమ ప్రచారమును కొనసాగించిరి. అల్మోరా, పిథోరాగఢ్‌లలో టిబెట్ సరిహద్దు ఉదంతములతో వారు ముఖ్యముగా కలిగించిన భావ సంచలనము స్మరణీయమైనది. అల్మోరాకు, కైలాసమునకు మధ్య, యాత్రికుల సౌకర్యార్థమై, వారొక ఉచిత సంచార-వైద్యశాలను గూడ నెలకొల్పి 40 సంవత్సరముల పాటు కొనసాగించిరి. అది లేకున్న ఎవరికిని వైద్యసదుపాయములు లభించెడివికావు. ఉత్తర ప్రదేశములో సరిహద్దు ప్రాంతములందు భోటియా ప్రజల నడుమ సాంఘికాభివృద్ధికిని వారు చాల ఎక్కువగా పాటుబడి పని చేసిరి.

శీతాకాలమున నీరు గడ్డకట్టు తాప ప్రమాణమునకు 30 F డిగ్రీలు క్రిందుగా శీతల వాతావరణముండినప్పుడు, పది అడుగుల యెత్తు మంచుపడినపుడు సైతము 1934-35 సంవత్సరములలో గంగోత్తరిలో నేకాంతవాసము చేసి తీవ్రముగ తపోనిష్ఠను సాగించిన ధీరులు వీరు.

శ్రీ ప్రణవానందస్వామి పశ్చిమ టిబెట్టునందున్న కైలాస-మానససరోవర తీరమందుగల ఆశ్రమమందు స్థిరనివాసమును కల్పించుకొనిరి. ఒకసారి 12 నెలలు, పదునారు నెలలు మరొక సారి, ఎడతెంపులేక నివాసము చేసి తపోధ్యానాధుల నిర్వహించిరి. మానస తీరమున పెద్ద యజ్ఞవేదిక నొకదానిని నిర్మాణము చేసిరి. ఇంతేగాక, నవీన మార్గములలో వాతావరణ స్థితిగతుల పరిశీలనయు గావించిరి. అంతేగాదు, మానస సరోవరమందును, రావణహ్రద మందును జల లక్షణములను అనగా ఈ సరస్సులు శీతకాలమున ఎట్లు గడ్డకట్టినదియు మరల వేసవిని ఎట్లు కరిగినదియు, శీతోష్ణ లక్షణములను పరిశీలించి చూచుటయు, వారి లక్ష్యమై యుండెను. మొత్తమునకు శ్రీ స్వామివారు 25 చాతుర్మాస్యలు గడపుటయే కాక కైలాస-మానస సరోవరములను ముప్పది మూడు పర్యాయములు చుట్టివచ్చిరి. మానససరోవరము యొక్క చుట్టుకొలతను కొలిచిరి. దాని చుట్టుకొలత 54 మైళ్ళు ఉండెను. అది చుట్టివచ్చుటకు వీలుగా స్వామి యంత్రాధిష్ఠితమైన ఇనుప పడవను - మోటారు బోటును-పదివేల రూపాయిలు కూలీలకై ఖర్చుపెట్టి తీసికొని వెళ్లిరి. సరోవరమంతయు గాలించి అందలి లోతును 300 అడుగులుగా నిర్ణయించిరి. సరోవర తలమున నున్న ఉష్ణగుండములను కనుగొనిరి. ఆ ప్రాంతములను చూడవచ్చు యాత్రికుల నిమిత్తమై ఆ పడవను అచ్చటనే తుగోల్హో (తోకర్) మఠమున వదలిపెట్టి వచ్చిరి. 'గౌరీకుండ'మను మరియొక సరోవరము, సముద్రము యొక్క మట్టమునకుపైన 18,400 అడుగుల ఎత్తున కైలాసప్రద

షిణ దిగుడులో నున్నది. ప్రపంచమందత్యున్నత స్థలమందున్న సరోవరమిది. స్వామి ఒక రబ్బరు పడవతో దీని లోతును గూడ కొలచి పరిశీలించి తెల్పిరి. ఇంత ఎత్తున నున్న సరోవరముల లోతును ఇంతవరకు ఎవ్వరును కొలిచియుండలేదు.

హిమాలయగర్భమందు దాగియుండిన రహస్యములన్నియు శారివలనసే భారతీయులకును, ప్రభుత్వము వారికిని, శాస్త్రజ్ఞుల కును తెలియవచ్చినవి. శ్రీ ప్రణవానందస్వామి సంతత తపో నిమగ్నులగుటయేగా, దాని పరిసరప్రాంతములలో సంచారము అప్పటి ఆధ్యాత్మిక వాతావరణమును, భౌగోళిక పరిస్థితులను, భూగర్భస్థితులను, వృక్షజాతులు, పక్ష్యాదులు మొదలగువాటి సృష్టి రహస్యములను పరిశోధించుచు అందలి యుత్కృష్టవిషయ ములను ఆయా శాస్త్రప్రవీణులకు—ఇంతవరకు ఊహకు అందని విషయములను పత్రికలలోను, విజ్ఞాన గ్రంథములలోను ప్రకటిం చుచు వచ్చిరి. తత్ఫలితముగా వీరి పరిశోధన వైజ్ఞానికులకును, భారత సర్వే ఆఫీసులకును శిరోధార్యమై వీరి యభిప్రాయములనే అంత్య నిర్ణయముగ గ్రహించిరి.

సత్యాన్వేషణలో వీరి యుత్సాహమునకు పట్టపగ్గములులేవు. సత్యాన్వేషణముతోడనే తమ జీవయాత్ర సాగింపవలెనని వారి అంతరాత్మ నిరంతరము ప్రేరేపించెడిది. వారి సంకల్పము దృఢ మైనది. సత్యాన్వేషణలో వీరి పట్టుదలప్రాకపుపట్టు. వీరు ఏదైనను సాధింపదలచిన, అది పూర్తియగు వరకు వదలిపెట్టెడివారుకారు.

వీరు 32 మైళ్ళు చుట్టుకొలత గల కైలాస శిఖరమును ప్రదక్షిణము చేయునపుడు వారు ఎన్నో భూగర్భశాస్త్ర రహస్యములను తెలిసి కొన గలిగిరి.

పశ్చిమ టిబెట్టులోని కైలాస, మానససరోవర ప్రాంతముల నుండియు, భారత-టిబెట్టు సరిహద్దుల నున్న శిఖరోపరిభాగముల నుండియు 19 కోట్ల సంవత్సరముల నాటివగు, అప్పటి సాముద్రిపు కీటకముల ప్రస్తరావశేషములను (fossils) స్వామి కడు ప్రయాసముతో సేకరించి, వాటిని భూగర్భశాస్త్ర పరిశీలకుల కందజేసిరి. చరిత్ర కందని ప్రాచీన శిలాయుగపు పరికరములు టిబెట్టులో విరివిగా దొరికినవి. ఇవి గాక మహత్తర-హిమాలయ ప్రాంతములలో నుండి (Greater Himalayan Ranges) వీరు సేకరించిన జీవజాలపు ప్రస్తరావశేషములను భారతీయ భూగర్భశాస్త్ర పరిశీలకులును, వారాణసీ విశ్వవిద్యాలయమువారును చాలవరకు పరిశీలించిరి. కొన్నింటిని ఇంకను పరిశీలించుచున్నారు.

శ్రీ ప్రణవానందస్వామి పశ్చిమ టిబెట్టునందుండునపుడే, కమ్యూనిష్టు చైనావారు 1950 సంవత్సరములోనే టిబెట్టు దేశము నాక్రమించుకొనిరి. అయినను స్వామి ఐదు సంవత్సరముల ఆ చోటును వదలలేదు. వారు టిబెట్టుననే యుండి చైనీయుల కపటోపాయములను గూర్చిన విషయములను సేకరించిరి. కాశ్మీరము నుండి అస్సాము చివరివరకు విదేశీయ క్రైస్తవ మిషనరీల యొక్కయు, పాకిస్తాను గూఢచారుల యొక్కయు దేశద్రోహ

కరములగు శిఖరములను కనిపెట్టి, వీరు సుమారు 4,000 పుటల విషయములను భారత ప్రభుత్వమునకు, ఉత్తర, ప్రదేశ ప్రభుత్వమునకును అందజేసిరి. వీరిచ్చిన రిపోర్టులను బట్టియే సరిహద్దు మండలమందంతటను విదేశీయమిషనరీల సంచారమును నిషేధించుచు నిషేధాజ్ఞలను జారీ చేసిరి. స్వతంత్రతా సంగ్రామ సేనాని మన స్వామి.

ఋషి మూలము, నదీమూలము తెలియబడదని మనవారు చెప్పుదురు. ఇట్టి వాడుక వచ్చుటకు కారణము గొప్ప గొప్ప నదుల పుట్టుక విషయమును ఎవ్వరును సాహసించి ప్రాణములకు తెగించి కనుగొనకుండుటయే. బ్రహ్మపుత్ర, సింధు, సట్లెజ్ (శతద్రు), కర్నాలీ (సరయు) నదుల పుట్టుక విషయమై స్వీడన్ దేశపు ప్రఖ్యాత భూగోళశాస్త్రజ్ఞుడగు డాక్టరు స్వెన్‌హెడిన్ కొన్ని నిర్ణయముల చేసియుండెను. అతడు ప్రచురించిన నిర్ణయములనే మన దేశపు భూగోళశాస్త్రవేత్తలు ప్రామాణికముగా గ్రహించుచుండిరి. కాని ప్రణవానందస్వామి స్వయముగా ఆయా చోట్లకు వెళ్లి, బ్రహ్మపుత్ర, శతద్రు, సింధు, సరయూ, గంగానదులు కైలాస - మానససరోవర ప్రాంతములకు నలువైపుల పుట్టిన సంగతిని నిర్ణయించిరి. డాక్టరు స్వెన్‌హెడిన్ నిర్ణయములను త్రోసిపుచ్చి తమ నిర్ణయములను ఛాయాచిత్రములతో సహా ప్రచురించిరి. దానితో సర్వే ఆఫ్ ఇండియా శాస్త్రవేత్తలు స్వామి నిర్ణయములనే ఏకగ్రీవముగా నంగీకరించి, దేశపటములను సవరించుకొనిరి.

మన దేశమునకు చెందిన దేశపటములలో నెన్నియో తప్పులు కలవు. అందలి సరిహద్దు రేఖలు దేశమునకు ప్రమాదమును కలిగించునవై యుండెను. దేశపటములను వ్రాయుటలో మనవారికి జాతీయ దృక్పథము చాలదు. భారతదేశసీమా ప్రాంతములను ఎవరును సరకు చేయలేదు. అస్పష్టమైన ఈ సీమారేఖలు భారత - చైనా దేశముల మధ్య తగాదాలకు దారితీసెను. స్వామి అన్నింటిని చక్కగా పరిశీలించి దేశపటములలోని తప్పులను భారతకేంద్ర ప్రభుత్వమువారి దృష్టికి తెచ్చిరి. జాతీయ దృక్పథము లేకుండా స్వదేశీయులగు దేశపట ప్రకాశకులు ముద్రించిన పటములను, స్వలాభకాంక్షతో విదేశీయులు ప్రకటించిన దేశపటములను నిషేధింపవలెనని స్వామి ప్రభుత్వమునకు తెలియజెప్పిరి. వీరు చెప్పిన విషయములలోని వాస్తవికతను గుర్తించి వారి సూచనల మేరకు, దేశపటములను సవరించిరి. స్వార్థదృష్టితో తప్పులు తడకలుగా సృజింపబడిన విదేశీయుల పటములలోని విధానములకు తమ ఆక్షేపణలను తెలియజెప్పిరి. కేంద్రప్రభుత్వ విదేశాంగశాఖ వారికి 1952-1954 సంవత్సరములలో పశ్చిమ టిబెట్టున 'తక్లాకోట్' అనుచోట చైనీయుల దుర్గనిర్మాణమును గూర్చిన (మిలిటరీ ప్లాన్లు) సైన్య నిర్మాణ ప్రణాళికలయొక్క వివరములను వీరు, ఒక్క విషయమైనను పోకుండా-ఒకటివెంబడి ఒకటిగా అందజేసిరి.

ప్రణవానందస్వామి భారతీయ సంస్కృతికి చేసిన సేవ మరువరానిది. బీహారు దేశమున భాగల్పూరులో బరారీ అనుచోట,

కుప్పాఘాటు వద్ద ఇప్పటికి 2,600 సంవత్సరముల క్రిందటివి, బౌద్ధయుగముకంటె ప్రాచీనమైన గుహారామములను కనిపెట్టిరి. అదియు గాక ప్రాచీన విక్రమశిలావిశ్వవిద్యాలయము యొక్క వాస్తవిక స్థలమును గూడ సుదీర్ఘ పరిశీలనపై, కనిపెట్టిరి. భారత భౌగోళికచరిత్రలో వారు నూతనములగు పరివర్తనలను తెప్పించిరి.

రూపగుండ మను తటాక సమీపమున 600 సంవత్సరముల క్రిందట తీవ్రమైన వడగళ్ళు, మంచుపడి సందాయాత్రికై హోమగుండమునకు వెళ్లుచుండిన కన్నోజ్ రాజ్యములోని, ధారా నగరపు రాజదంపతులు, జసధల్-బాల్పాల, సుమారు 200 మంది యాత్రికదళమంతయు తుడుచుకొనిపోయి, మంచులో కూరుకొని పోయెను. హిమాలయప్రాంతప్రజలు ఆ విషాదాంతకథకు చెందిన 'పదములను'—బొబ్బిలిపాటలవంటి వాటిని – గడ్వాలీభాషలో పాడి వినిపించుచుందురు. అది విన్నవారు కంటనీరు పెట్టుకొందురు. అట్టి తేజస్వంత విషాదాంత గేయములను — 300 పుటల పాటలను—స్వామి సేకరించి హిందీ భాషలోనికి అనువదించిరి. అవి ముద్రణభాగ్యము నొందవలసి యున్నవి. అంతటితో ఆగక స్వామి అట్టి విషాద సంఘటన జరిగిన ఆ 'రూపకుండ' తటాకము నందలి రహస్యమును కనుగొనదలచి, వరుసగా పదునొకండు సంవత్సరములు, మొత్తమునకు 25 పర్యాయములు ఆ తటాకమును తత్ప్రాంతములను చూచుటకు అన్వేషణయాత్రలు

(Exploratory Expeditions) నలిపిరి. ఆ తటాకము నిరంత రము మంచుతో కప్పబడియుండును. అచ్చోట పదిమణుగుల అస్థిపంజరముల అవశేషములు—750పొడవు ఎముకలు90పుర్రెలు, 115 దౌడలు (Jaws), మాంసపు భాగములు, 50 తోళ్ళ చెప్పులు, 12 ఇనుపగంటలు, కొన్ని భూర్జపత్రపు గొడుగు కర్రలు, తమరక ములు, వస్త్రములు, పింగాణి గాజులు, వెండి, (Agate) ఒక విధ మగు రాతిపూసలు, దంతపు పూసలు, కంచుమట్లు, దంతపు గాజులు, శంఖపుగాజులు, మొదలగు సాంస్కృతిక వస్తువులు లభించినవి. వాటినన్నింటిని, ప్రణవానందస్వామి సేకరించి వాటిలో కొన్నింటిని ఉత్తరప్రదేశ్ ప్రభుత్వపు లక్నో వస్తు సంగ్రహాల యమునకును, మిగతావాటిని కలకత్తాలోని అఖిలభారత జనజాతి విభాగమునకు (Anthropological Srvey of India) అందజేసిరి. ఇవన్నియు 600 సంవత్సరముల క్రిందట అక్కడికి నందాదేవి యాత్రకు వెళ్లి హిమపాతమునకు గురియైన పైజెప్పిన యాత్రి కులకు చెందినవి.

కుమాయూంలో (కూర్మాచలములో) దేవతావిగ్రహము లను పరిశీలించు నిమిత్తమై సంచారము చేసి వాటికి, చెందిన 400 ఛాయాచిత్రములను వీరు తీసిరి. వాటి స్వభావములను వివరిం చుచు నొక 'సూచిక'ను కూడ వీరు తయారుచేసిరి. శిల్పశాస్త్ర దృష్ట్యా అవి చాల మహత్తరమైనవి, వానిలో కాలభుషుండుడు.

కామధేనువు, కార్తికేయుడు, పదిచేతులుగల పంచముఖ శివుడు, లకులీశ్వరుడు, ఆదిత్యుడు మొదలైన దేవతావిగ్రహములు సాటిలేనివి.

అప్రతిమా సాహసమునకు స్వామి పెట్టినదిపేరు. హిమ నగరసీమలలో అత్యున్నత ప్రదేశములందు గల సాంద్రారణ్యము లందు గూడ వారు అన్వేషణలు సాగించిరి. నిత్యనూతనములై తోచు అనేక విషయములను కనిపెట్టిరి. మిక్కిలి గోప్యమై ఎవ్వరికి తెలియరాక ఉండిన మంచు మనిషిని (Abominable Snow-man) గూర్చిన, వివాదమును శాశ్వతముగా పరిష్కరించిరి. అది 'హిమాలయము'లో సంచరించు నల్ల, లేక, ఎరుపుడవులు గల ఎలుగుబంటి అని.

భారతీయులకు పరిమళ ద్రవ్యమునందిచ్చు మృగములలో కస్తూరి మృగము పేరుపొందినది. కస్తూరి ద్రవ్యము భారతీయుల జీవితములో అత్యంతోపయుక్తమైనది. కస్తూరి, కస్తూరి మృగము రొక్క నాభియందుండునని పలువురు చెప్పుదురు. కాని అది కస్తూరి మృగము నాభియందు దొరకదు, అంతటి సువాసన ద్రవ్యము ఎట్లు బొడ్డులో అమరియుండునో అని స్వామి విశేష పరిశోధనలు చేసిరి. కస్తూరి మృగములను, పరిశీలన నిమిత్తము గొనిపోయి వాటిని ఐజట్ నగరమునకును, ముక్తేశ్వర్, మధురల లోని పశు-వైద్యశాలలకును పరిశీలనార్థమై అందజేసిరి. కస్తూరి

యొక్క పుట్టుకకు గారణమైన మూలమును కనుగొనిరి. కస్తూరి, మగ మృగములో లింగమునకు దగ్గరనున్న ఒక ప్రత్యేకపు తిత్తిలో నుండును. మగ కస్తూరి మృగమునకు రెండు కోరలుం డును. 'కస్తూరి, కస్తూరి మృగము' అను స్వామి వ్రాసిన పరిశో ధక వ్యాసమును చూడునది.

శ్రీ ప్రణవానందస్వామి పదునెనిమిది సంవత్సరముల నుండి శ్రీచక్రము (యంత్రము) పై గొప్ప పరిశోధనలు చేసి, సంప్రదాయక విషయములమీద సుదీర్ఘ విమర్శ వివరము లతో 300 పుటల గ్రంథమును తయారుచేసిరి. ఈ గ్రంథ వివర ములు ఆంగ్లభాషలో గలవు. అదియు ముద్రణ భాగ్యము నొందవ లసియున్నది. మనస్వామి ఇప్పుడు 77 సంవత్సరముల యువ కుడు. ఇది శ్రీ ప్రణవానందస్వాముల జీవిత సంగ్రహము.

1970 లో శ్రీ ప్రణవానందస్వామి మద్రాసునకు వచ్చిన పుడు తాము వ్రాసిన "శ్రీ జ్ఞానదీపిక" యను శ్రీ భగవద్గీతాంధ్ర వ్యాఖ్యానమును ముద్రించుటకు తగిన ముద్రణాలయమును గూర్చి వివరములడిగిరి. ముద్రణ విషయమై అవసరమైన సహాయమును సమకూర్చుటకు నా సంసిద్ధతను తెలిపితిని. వారందులకు సమ్మ తించి గ్రంథ ముద్రణకు సంబంధించిన బాధ్యతను నాపై విడిరి.

ఈ మహద్వ్యాఖ్యానమును అచ్చువేయించు సందర్భములో నేనీగ్రంథము ననేక పర్యాయములు చదివితిని. ఇదివరలో నేను

పలువిధములగు గీతావ్యాఖ్యానములు చదివితిని. విద్వత్పుంగవుల గీతాప్రవచనములను వినియుంటిని. కాని ఈ "జ్ఞానదీపికా" వ్యాఖ్యానము సర్వోత్కృష్టమై హృదయంగమముగనున్నది. ఇది పండితులకు మాత్రమేగాక పామరులకుగూడ సుబోధకమగు రీతిలో సులభగ్రాంథిక శైలిలో వ్రాయబడి యున్నది. అనేకములగు క్రొత్త విషయములందులో గలవు ప్రతి విషయమును క్షుణ్ణముగా వివరింపబడియున్నది. జిజ్ఞాసువులు ఈ సద్గ్రంథము నామూలాగ్రముగా చదివి గీతాప్రాముఖ్యమును చక్కగా దెలిసి కొనగలుగుదురని ఆశించుచున్నాను.

ఇట్లు

నెం, 10. విజయరాఘవాచారి రోడ్డు, విబుధవిధేయుడు
త్యాగరాయనగరం, కె. ఎస్. శాస్త్రి.
మద్రాసు - *600 017*. (దోర్బలపు శోభనాద్రి శాస్త్రి)
10-4-73.

# అనుబంధము 10

# దేవ్యపరాధ స్తోత్రరత్నమ్

శ్లో॥ నమంత్రం నోయంత్రం తదపినజానే స్తుతి మహో, నచాహ్వానం ధ్యానంతదపిచన జానే స్తుతి కథాః, నజానేముద్రాస్తేతదపిచనజానే విలపనం పరం జానే మాత స్త్వదనుసరణం క్లేశహర

ణమ్. ౧. విధేరజ్ఞానేన ద్రవిణ విరహేణాలసతయా, విధేయాశ క్యత్వా త్తవ చరణ యోర్యాచ్యుతిరభూత్, తదేతత్క్షంతవ్యం జనని సకలోద్ధారిణిశివే, కుపుత్రోజాయేత క్వచిదపి కుమాతాన భవతి. ౨. జగన్మాతర్మాత స్తవచరణసేవానరచితా, నవాదత్తం దేవిద్రవిణ మపి భూయ స్తవమయా, తథాపిత్వం స్నేహంమయి నిరుపమం యత్ప్రకురుషే, కుపుత్రోజాయేత క్వచిదపి కుమాతా న భవతి. ౩. పృథివ్యాం పుత్రాస్తే జనని బహవస్సంతి సరలాః, వరం తేషాం మధ్యే విరళ విరళోఽహం తవ సుతః, మదీయోయం త్యాగ స్సముచితమిదం నోతవ శివే,కుపుత్రోజాయేత క్వచిదపి కుమాతానాభ వతి. ౪. పరిత్యక్తాదేవా వివిధ పరసేవా కులతయా, మయా పంచా శీతేరధిక మపనీతేతు వయసి, ఇదానీం నోమాత స్తవయది కృపా నాపిభవితా, నిరాలంబోలంబోదర జనని కంయామి శరణమ్. ౫. శ్వపాకో జల్పాకోభవతి మధుపాకోపమగిరా, నిరాతంకోరంకో విహసతి చిరంకోటితనకైః, తవాపర్ణే కర్ణే విశతిమనువర్ణే ఫల మిదం, జనఃకో జానీతే జనని జపనీయం జపవిధౌ, ౬. చితాభస్మా లేపో గరళమశనందిక్పటధరో, జటాధారీకంఠే భుజగపతిహారీ పశు పతిః, కపాలీ భూతేశోభజతి జగదీశైకపదవీం భవాని త్వత్పాణిగ్ర హణ పరిపాటీఫలమిదమ్. ౭. నమోక్షస్యాకాంక్షా భవతి భవవాంఛా పిచనమే, నవిజ్ఞానాపేక్షా శశిముఖి సుఖేచ్ఛాపి నపునః, అతస్త్వాం యాచేఽహం జనని జననం యాతుమమవై, మృడానీ రుద్రాణీ శివ శివ భవానీతి జపతః. ౮. నారాధితాసి విధినా వివిధోపచారైః, కిం రూక్షచింతనపరైర్నకృతం వచోభిః, శ్యామేత్వమేవ యది

కించనమయ్యా నాథే, ధత్సే కృపాముచితమంబపరం తథైవ. ౯.
ఆపత్సుమగ్నస్మరణం త్వదీయం, కరోమిదుర్గే కరుణార్ణవే శివే,
నైతచ్ఛరత్వం మమదాపయత్వం, క్షుధాతృషార్తా జననీంస్మరంతి
౧౦. జగదంబ విచిత్రిమత్రకిం పరిపూర్ణా కరుణాస్తి చేన్మయి,
అపరాధపరంపరావృతం నహిమాతాసముపేక్షతే సుతమ్. ౧౧.

ఇతి దేవ్యపరాధస్తోత్ర రత్నం

సంపూర్ణమ్.

# అనుబంధం 11

## డాక్టర్ స్వామి జ్ఞానానంద

ఎందరో మహానుభావులు అందరికిని వందనంబు—అన్నారు త్యాగయ్యగారు. ఆయన ఎందరు మహానుభావులను దర్శించారో! నేను ఆ సేతుశీతనగరం, ఆ హంపి హరప్పం తిరిగిన తిరుగుళ్లలో ఎందరో మహానుభావులను దర్శించాను. జడభరతుల వలె ఉంటూ నిరంతరం సమాధి నిష్ఠులైనవారిని, ఎవరిని చూచినా పరమాత్మ గానే భావించేవాడిని, అక్షరం ముక్క చదువకపోయినా అక్షర పర బ్రహ్మ రహస్యాలను కదళీపాకంగా చెప్పి చూపుతున్న వారిని, ప్రజాసామాన్యావర్జనకు మాయలు, గారడీలు చేసినా, మాయను దాటి మూలతత్త్వాన్ని సాక్షాత్కరించుకొన్న వారిని, జ్ఞాన విజ్ఞానాల

సమన్వయంతో ఆధునికులకు నచ్చజెప్పుతున్నవారిని, దగ్గర కూర్చుంటేనే అజ్ఞానాన్ని పోగొట్టేవారిని, పాండిత్యాలు, ప్రభుతలు పరమాత్మను అందుకోవని తమ పాండిత్యాన్ని కుప్పగా ఆధ్యాత్మికాచార్యుని సన్నిధిని పోసి మూర్ఖత్వాన్ని వరించిన మహామహులను—ఇలా ఎందరినో దర్శించాను. స్వామి డాక్టర్ జ్ఞానానంద నేను దర్శించిన వారందరిని కలబోసిన మహానుభావులుగా కనిపించారు ఆయన 1890 డిశంబరు 5న జన్మించారు. అంటే 90 ఏళ్లయింది. ఇలాటి మహా యోగి, మహా తత్త్వవేత్త, మహా విజ్ఞాన శాస్త్రజ్ఞుడు తెలుగుదేశంలో జన్మించడం గర్వకారణంగా భావిస్తాను. అయన తెలుగువారైనా యావద్భారతానికి చెందిన మహా యోగి పుంగవులు. స్వామి జ్ఞానానంద 90వ జయంత్యుత్సవాన్ని పశ్చిమ గోదావరి జిల్లా గౌరగుమూడి గ్రామములోని ఆయన సమాధి వద్ద నిర్వహిస్తున్న శ్రీ భూపతిరాజు పద్మనాభరాజును ఇటీవల కలుసుకున్నప్పుడు ఆయన ఉత్సవ సన్నాహాలను గురించి తెలియజేశారు. ఆయన రాష్ట్రప్రభుత్వ వ్యవసాయ శాఖలో డెప్యూటీ డైరెక్టర్ పదవి నిర్వహించి విశ్రాంతి పొందినవారు, శ్రీ స్వామి జ్ఞానానంద చరితామృతాన్ని తదితర గ్రంథాలను ముద్రించడానికి హైదరాబాద్ వచ్చారు. ఈ సందర్భంలో ఆశ్చర్యకరమైన శ్రీ స్వామి జ్ఞానానంద జీవితవిశేషాలు తెలుగువారు తెలుసుకోడం అవసరం. శ్రీ జ్ఞానానంద పూర్వాశ్రమ నామధేయం భూపతిరాజు లక్ష్మీనరసింహరాజు. తలిదండ్రులు శ్రీమతి సీతయ్యమ్మ—శ్రీ శ్రీరామరాజుగార్లు శ్రీ జ్ఞానానందకు చిన్ననాటి నుంచే.

ఆధ్యాత్మిక చింత ఉండేది తణుకు మాధ్యమిక పాఠశాలలో చదువుతుండగా, మహారాష్ట్రం నుంచి ఒక స్వాములవారు వచ్చి కృష్ణ మంత్రం ఉపదేశించారట అప్పటినుంచి శ్రీ జ్ఞానానంద జీవితాంతం కృష్ణ భక్తులుగా ఉన్నారు. ఆయన నరసాపురం ఉన్నతపాఠశాలలో చదువుతున్నప్పుడు వివాహం జరిగింది. కాని, ఆయన శ్రీరామకృష్ణపరమహంసలాగ గృహస్థ బ్రహ్మచారిగానే ఉన్నారు. 1917లో స్కూలు ఫైనల్ పరీక్ష తప్పినట్లు తెలిసింది. ఆ సాకుతో ఆయన కొంత రైలు మీద, కొంత కాలినడకన పయనించి ఖరగ్ పూర్ చేరారు. తరువాత నేపాల్ సరిహద్దులలోను, మౌంట్ అబూ గిరి శిఖరాలలోను, హిమాలయ స్వర్గాశ్రమంలోను, కాశ్మీరంలోను, బదరీ గంగోత్రీగిరి కందకాలలోను 18 వేల అడుగుల ఎత్తున అతి శీతల వివిధ ప్రదేశాలలో దిగంబరులై తపస్సు చేశారు ఆయన హిమానీనదాలపై పరుగులు తీస్తుంటే అందరూ ఆశ్చర్యంగా చూచేవారట. ఇతరులు ఆయన కాలుతున్న వీపు మీద కొంకర్లు పోయిన తమ చేతులను కాచుకునేవారట. హిమాలయంలోని స్వర్గాశ్రమంలో ఒక వంగదేశ స్వామి ఆయనకు సన్యాస దీక్ష ఇచ్చి, స్వామిజ్ఞానానంద అనే తురీయాశ్రమనామం ప్రసాదించారు.

ఆయన వివిధ యోగప్రక్రియలు చేశారు. హఠయోగంతో దేహంలో అణువణువూ తన చెప్పుచేతల్లో పెట్టకొన్నారు. తిండి తిప్పలూ లేక వారాల తరబడి చేసిన తపస్సులో సమాధ్యవస్థలో

దర్శించిన దివ్యతాత్త్విక పరమార్థ విభూతులను "పూర్ణ సూత్రాలు" అనే పేరుతో క్రోడీకరించారు. ఆంగ్లంలో వీటి వివరణాదులు 1927 నాటికి పూర్తయాయి. దీనిని సుందరంగా ముద్రించాలనే సంకల్పంతో జర్మనీ వెళ్లారు. ఇది ఆయన జీవితాన్ని పూర్తిగా మార్చివేసింది. పాశ్చాత్యులకు ఆధ్యాత్మిక విషయాలు బోధించాలని, దానికోసం ఆధునిక విజ్ఞాన శాస్త్ర పాండిత్యం అవసరమని ఆయన గ్రహించారు. విద్య, అవిద్య పరతత్త్వమనే నాణానికి రెండు పార్శ్వాలని, పరిపరతత్త్వ అవగాహనకు జ్ఞాన విజ్ఞానాలు రెండూ రెండు చేతుల వంటివనీ, ఆత్మసాక్షాత్కార పరమార్థ విహాయస విహారానికి రెండు రెక్కలవలె అవి ఉపకరిస్తాయని ఆయన భావించారు. విజ్ఞానశాస్త్ర అధ్యయన పరిశోధనకు పూనుకున్నారు. గణిత, భౌతిక, విద్యుదయస్కాంత, పరమాణుభౌతిక, ఉష్ణ, కాంతి, వాతావరణాది శాస్త్రాలలో ప్రామాణికమైన పరిశోధనలు జరిపారు. జెకోస్లోవాకియాలోని ప్రాగ్ విశ్వవిద్యాలయం ఆయన పరిశోధనకు మెచ్చి డి. ఎస్. సి బిరుదు ఇచ్చింది. ఇంతలో ద్వితీయ ప్రపంచ సంగ్రామ మేఘాలు జర్మనీలో ముసురుకోడంతో ఆయన జర్మనీ నుంచి ఇంగ్లండుకు వెళ్లారు. అక్కడ లివర్‌పూల్ విశ్వవిద్యాలయంలో సర్ జేమ్స్ చాడ్విక్‌తో పాటు భౌతిక పరమాణు శాస్త్రాలలో పరిశోధన విశేషాలకు లివర్‌పూల్ విశ్వవిద్యాలయం ఆయనను పి. హెచ్. డి. బిరుదంతో గౌరవించింది. లండన్‌లోని ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫిజిక్స్ గౌరవ

ఫెలోషిప్పుతో సత్కరించింది. యుద్ధం ముమ్మరం కావడంవల్ల పరిశోధనకు కావలసిన ఐసోటోపులు ఇంగ్లాండులో లభించనందున ఆయన అమెరికాకు వెళ్లారు. 'హైపాక్స్యూవా'అనే ఆయన గ్రంథాన్ని న్యూయార్క్‌లోని డివాన్ నాస్ట్రాండ్ కంపెనీ ముద్రించింది. ఆయన బీటారే స్పెక్ట్రాస్కోప్‌లో విశ్వవిఖ్యాతమైన పరిశోధనలు జరిపారు. అమెరికా ఆయనను సిగ్మాక్సై అనే అత్యంత ప్రతిష్టా కరమైన శాస్త్ర విజ్ఞాన సంస్థ సభ్యత్వంతో సన్మానించింది. ఆయన 1938 లో కలకత్తాలో జరిగిన సైన్స్ కాంగ్రెస్‌లో ప్రముఖ పాశ్చాత్య శాస్త్రజ్ఞులతోపాటు పాల్గొన్నారు. ఇంతలో 1947 లో భారతదేశం స్వతంత్రమైంది. ఆయన భారతదేశానికి తిరిగివచ్చారు. అప్పటి ప్రధాని పండిట్ జవాహర్‌లాల్‌నెహ్రూ కోరికపై ఆయన నేషనల్ ఫిజికల్ లేబరేటరీస్‌లో ఎలెక్ట్రిసిటీ ఎల్‌క్ట్రానిక్స్ విభాగంలో చేరారు. 1954 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం పర మాణు విజ్ఞాన విభాగాన్ని రూపొందించి నిర్వహించడానికి ఆయ నను ఆహ్వానించింది. ఆయన ఆ శాఖకు అధినేతగాను, ఆచార్యుడు గాను వుండి ప్రపంచంలోనే ఆ శాఖకు గొప్ప యశస్సు కలిగిం చారు ఆయన పర్యవేక్షణలో కొన్ని పదులమంది పరమాణు శాస్త్రంలోను, తదనుబంధ శాస్త్రాలలోను డాక్టరేట్లు సంపాదించారు. ఆయన జర్మనీలో వున్నప్పుడు నేతాజీ సుభాష్‌చంద్రబోస్‌కు అతిథి గాను ఉన్నారు. ఆయన జర్మనీలో వద్దర్శనాలను గురించి. భార

తీయ సంస్కృతిని గురించి చేసిన 150 ప్రసంగాలలో నాలుగుమా త్రమే 'దార్శనిక మహాప్రవచన' అనే పేరుతో ప్రచురితమయాయి. సమాధ్యవ్యవస్థను గురించి, రాజయోగాన్ని గురించి వ్రాసిన ఆంగ్ల కవితాఖండికలు 'గ్లింప్సెస్' అనే పేరుతో సంపుటంగా ప్రచురితమయ్యాయి 'పూర్ణసూత్రాణి' సంస్కృతాంధ్రానువాదాలతో ముద్రితమైంది. ఆయన అంతర్జాతీయ వేదాంత సభ (అహమదా బాద్) అధ్యక్షోపన్యాసం, ఆయన తన కుటుంబం వారికి, భక్తులకు, శిష్యులకు, అభిమానులకు వ్రాసిన లేఖలు శ్రీ జ్ఞానానంద లేఖావళిగా అచ్చయాయి. ఆయన పరమాణుశాస్త్రంపైన, ఇతర భౌతిక శాస్త్రాలపైన పెక్కు గ్రంథాలు రచించారు. ఆయన 1969 లో సిద్ధి పొందారు. ఆయన చరిత్రి శ్రీ స్వామి జ్ఞానానంద చరితామృతం అనే పేర ఆయన స్వీయ చరిత్రతోపాటు 90వ జయంత్యుత్సవంలో ఆవిష్కరిస్తామని శ్రీ భూపతిరాజు సద్మనాభరాజు తెలిపారు.



## అనుబంధము 12

గత 17 సంవత్సరములలోను మేము పరిశీలించిన సుమారు 180 వివిధ ప్రస్తార శ్రీచక్రములలోను ఈ దిగువ నుదహరింపబడిన 40 విధములగు తప్పులు గుర్తింపబడినవి.

1. శ్రీచక్రములోని మర్మస్థానములలో (మూడు రుజు రేఖల straight lines కలసినచోటులలో) చిన్న పెద్ద త్రికోణములు ఏర్పడుట;

2. రెండు పద్మదళముల మధ్యగాని రెండు ఉపచక్రముల మధ్యగాని స్థలములను (gaps) వదలుట;

3. ఏ ప్రస్తారపు శ్రీచక్రము నందైనను గుమ్మములను కల్పించి వాటిని తెరచినట్లుగాని మూసినట్లుగాని చూపించుటయే తప్పు;

4 శ్రీచక్రమున చక్రవలయముల మధ్య బద్దీలు. లేక, పటకాలను వేయుట (అనగా, ఉపచక్రములన్నియు ఒకదాని నొకటి అంటియుండకుండ చూపుట);

5. అట్టి శ్రీచక్ర నిర్మాతలకు శ్రీచక్రము యొక్క మూల తత్త్వమే తెలియనివారని సూచించును;

6. భూప్రస్తార శ్రీచక్రములో అయిదు త్రికోణములను ఊర్ధ్వ ముఖముగను; నాల్గుకోణములను అధోముఖము చూపుట (ఇది కౌలాచార పద్ధతి, సమయాచార పద్ధతి గాదు);

7. అలాగుననే, మేరువు, లేక, కూర్మపృష్ఠ శ్రీచక్రమున నాలుగు కోణములను ఎదుటకును, అయిదు కోణములను వెనుకకును, చూపుట;

8. శ్రీచక్ర మేరువును అయిదు కోణములు పశ్చిమాభి ముఖముగ పెట్టక, మరి ఏ ఇతర దిశగ పెట్టినను అది తప్పే;

9. భూప్రస్తారచక్రమున, బిందువును, త్రికోణమునకు పైనున్న: లేక, క్రిందనున్న చతుష్కోణమున (Trapezium)లో పెట్టుట

చాల తప్పు; (ఏలనన, వాస్తవమున అచతుష్కోణము శ్రీచక్రమునకు బాహ్యమున నున్నది);

10. శ్రీచక్రోద్ధారమున, బిందువును చెప్పకపోవుట (సుభగోద స్తుతిలో వలె);

11. బిందువును, త్రికోణ మధ్య ఒక చుక్క (Point) గ గావి, త్రికోణము యొక్క భుజములను తాకకుండగ ఒక చిన్న నున్నగగావి పెట్టుట, (వాస్తవమున బిందువు, భూప్రస్తార చక్రమున, త్రికోణము యొక్క భుజముల (sides) ను తాకు చునే యుండవలెను);

12. వృత్తత్రయ స్థానమున ఒకే వృత్తమును చూపుట;

13. వృత్తత్రయ స్థానమున రెండేవృత్తములను చూపుట;

14. వృత్తత్రయ స్థానమున నాల్గు వృత్తములను జూపుట;

15. అష్టదల పద్మము యొక్క కర్ణికా వృత్తమును షోడశదలము యొక్క కర్ణికా వృత్తమును, షోడశదల పద్మముపైన ఒక వృత్తమును కల్పించి, వీటిని కలపి మర్యాదా వృత్తములని, ఒక విచిత్రనామమును కల్పించి, వాటిని వృత్తత్రయమని పిలుచుట (మర్యాదా వృత్తములను కల్పించినది శ్రీ విద్యారణ్యస్వాములు; విశేషించి శ్రీ కల్యాణానందభారతీస్వాములు వారు, వారి అనుయాయులును) (వాస్తవమున వృత్తత్రయము షోడదశలము తరువాతనే యుండవలెను);

16. అష్టదళ షోడశదళ పద్మములు మరియు రెండు వృత్తములను (ఒకటి అష్టదళపద్మముపై కల్పించిన వృత్తము, రెండవది షోడశదళపద్మము యొక్క కర్ణికా వృత్తము). వృత్తత్రయము యొక్క స్థానములో నాల్గు వృత్తములు, అష్టదళము యొక్క కర్ణికా వృత్తమును కలిపి మొత్తము ఏడు వృత్తములను చూపుట, లెక్కించుట ('కల్యాణ' 'శక్తి' అంకములో వలె);

17. విశేషించి శ్రీచక్ర మేరువునందు వృత్తత్రయమును, ఒకదానిపై నొకటి మెట్లవలె లేపుట మరియు భూపురముపై ఉండవలసిన మూడు భూపుర చతురస్ర రేఖలను కూడ మెట్లలోనే చూపుట (అందుచే భూమి మీద ఉండవలసినవి, అరు ఎత్తులు ఎక్కువగుటచే త్రిపుటక్రమమంతయు తప్పగుచున్నది);

18. భూపురము యొక్క నాల్గు కోణములలోని త్రికోణపు స్థలములలో, ఎవరికిష్టమువచ్చినట్టువారు అలంకారపు పూవులను, లతలను చూపుట తప్పు;

19. పద్మదళములను పైకిగాని, క్రిందగాని వేసినవాటికిగాని, కొనలను కత్తిరించి చూపుట;

20. మేరుచక్రములలోని భూపుర రేఖలను ఒక దానిపై నొకటి లేచినట్లు చూపుట;

21. మేరు చక్రమును, తిరగవేసిన, లేక, బోర్లవేసిన భూప్రస్తార చక్రముపై పెట్టుట (తిరువణ్ణామలై లోని రమణాశ్రమములోని.

ముత్తుస్వామి దీక్షితారు శ్రీచక్రముల వలె, (ఇది ఒక ఫొటోఫ్లే దాని విగ్రహమును పెట్టిన రీతిగ నుండును; ఇది తప్పు;).

22. మేరుచక్రములలో భూపుర రేఖలను, వృత్తత్రయమును అధోరేఖగ చూపుట; (ఊర్ధ్వముగ రేఖలు ఉండవలసిన చోట);

23. భూప్రస్తార శ్రీచక్రమును గోడకుగాని, ఇంకొక యంత్రమునకు అప్పుగాని, నిలవబెట్టుట;

24. పూజకు ఉపయోగించు శ్రీచక్రమునందు బీజాక్షరములను చూపుట (శ్రీచక్రము బీజాక్షర శూన్యమైనది);

25. ఇతర దేవతలయొక్క బీజాక్షరములకు శ్రీచక్రములోనికి దూర్చుట;

26. బిందువును శివలింగమువలెగాని, కలశవలె గాని నిలువుగా చూపుట;

27. భూప్రస్తార శ్రీచక్రములోని పద్మదళములను అరసున్నలుగాను, మేరువులో అరసున్న, లేక, వి (V), లేక, (బ్రాకెట్టు (Braket) దిమ్మలుగ చూపుట;

28. భూపుర చక్రమును, మొదటి చతురస్ర రేఖతోగాని పీఠముతో గాని ఏకము చేయుట;

29. మేరువు యొక్క ఎత్తు, ప్రక్కల కంటె ఎత్తుగ చూపుట;

30. మేరువు యొక్క ప్రక్కలను అనమానముగా చూపుట;

31. శ్రీచక్రమునకు 'నిత్యోత్సవము'లో చెప్పినట్లు గాక ఇష్టము వచ్చిన రంగులు వేయుట;

32. దేవాలయములలో అర్చకుడు దేవతకు సమ్ముఖముగా గూర్చుండక, ఒక ప్రక్కన నిలువబడి అర్చన చేయుట చాలనిషిద్ధము; (శ్రీచక్రమునకు అర్చన చేయువారు విధిగా, ఐదు కోణములకు అభిముఖముగాను, తాను, పూర్వాభిముఖముగాను కూర్చుండవలెను);

33. కూర్మపృష్ఠ శ్రీచక్రము యొక్క కొలతలు ఎక్కడను ఇవ్వబడలేదు, ప్రతి ఉపచక్రము యొక్క ఎత్తు సాధ్యమైనంత తక్కువగా చూపవలెను, మేము చూచిన చాలచోట్ల ఎత్తులు పలు విధములుగ చూపబడినవి; మేరు చక్రమునకు శాస్త్రములో చెప్పబడిన ఎత్తుకంటె తక్కువ ఎత్తుగల శ్రీచక్రములన్నియు అర్ధమేరువుగానే పరిగణింపబడినవి;

34. మహా మహోపాధ్యాయ కవిరాజ గోపీనాథ్, ఆర్థర్ ఎవలన్ గార్ల వారి శ్రీచక్రముల నిర్మాణమునందు, 96 భాగముల విధానమును అవలంబింపక, త్రికోణభాగము (అనగా మొదటి రెండు ఖండములను, చంద్రఖండము కంటే) ఎక్కువ భాగము వినియోగించుట; వాస్తవమున మొదటి రెండు ఖండములఎత్తు మూడవ ఖండముతో సరిసమానముగా చూపవలెను;

35. పైన ఉదహరింపబడిన తప్పులు, లోపములు, అవకతవకలకు కారణములు, శ్రీచక్రములు లిఖించు చిత్రకారుల యొక్కయు (డ్రాఫ్టుమెన్), లోహకారులు (లోహకారుల అచ్చుపారు) వారి యొక్కయు రాతిచెక్కుబడులు చేయువారి యొక్కయు, అననుకూలతను బట్టి చేయుటకు లోనగుటయు, వీటి అన్నిటి కంటె పైని, ఈ విషయములో యంత్రము చేయువారియొక్క తక్కువ పరిజ్ఞానముయు కారణములు;

36 వీటి అన్నిటికంటే పైని, జ్ఞాతముగను, అజ్ఞాతముగను, శ్రీచక్ర నిర్మాణములో దూర్చబడి, నిలబడిపోయిన తప్పులను అంగీకరించుకొని గుడ్డిగ వాటిని సాంప్రదాయకముగా వచ్చినవాటిగా తలంచి, వాటికి సాంప్రదాయక, ప్రాముఖ్యత ఇచ్చుట;

37. బిందువు (Point) ను పెద్దదిగ చేసినచో ఒక వృత్తమగును, వృత్తము (Cirle) ను కుదించినచో బిందువగును. అందుచే భూప్రస్తార శ్రీచక్రమున బిందువును త్రికోణముయొక్క ప్రక్కలకు (sides) ను తాకుచుండునటుల చూపవలెను. మేరువులో త్రికోణముపైన చిన్న గోళకము (globe) గ చూపవలెను. అదిగాక, శ్రీచక్రములోని ప్రతి ఉపచక్రమున ఒకదానికొకటి తాకుచుండునటుల చూపవలెను; అట్లుగానిచో అది శ్రీచక్రమునకు బయటపడిపోవును, అది తప్పగును;

38. బిందువనగా, ప్రళయకాలమున బ్రహ్మాండమంతయు బిందు సమసిపోవు ఒక స్థితి అది అంతులేని స్థితి; దానికి హద్దు పద్దులు లేవు; గణితములోని చుక్క (point) గాదు. ఆధ్యాత్మిక పరిభాషలో. దేనినుండి ఈ బ్రహ్మాండమంతయు ఆవిర్భవించెనో అట్టి ఘనీభూతమగు ఒక మహాశక్తి. అది పూర్ణమగుటచే. ఒక్క పూర్ణము, లేక, వృత్తము చేతనే చూపవలెను. అన్యథా అది తప్పగును;

39 ఈ సందర్భములో "కామకల" సృష్టికి ప్రారంభమును సృష్టిక్రియలో ఉత్పన్నమైన కదలిక, లేక, స్పందనయే ఓమ్‌కారము, ప్రణవము; అది పురుషుడు కాదు. స్త్రీయు కాదు. అదే బ్రహ్మము, చరాంశము ప్రకృతి, లేక, శక్తి అనియు అచరాంశము శివమ్ అనియు పిలుతురు. దానినే టిబెట్టు దేశస్థులు యబ్ – యుమ్ తల్లి–తండ్రి ముద్రి యందురు. అర్థనారీశ్వరుడు అందురు. ఆ పరమాత్మయొక్క దివ్యలీలలే ఈ నామ రూపాత్మక సృష్టికి కారణ భూతములైనవి. వాటినే కామేశ్వర, కామేశ్వరి అని కూడ అందురు. తంత్రశాస్త్రమున మాతృక, తల్లి అంశకు ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చిరి.



6. జననీ ! కుక్క మాంసము తినువాడు మాటాడగలడు, అట్లే త్రాగుబోతు కోటివికారములతో నిరాటంకముగా వాగుచు అట్టహాసము చేయగలడు. అపర్ణా ! నీ మంత్రము చెవిలో పడిన పడిలో ఫలము ఇది. జననీ ! ఏజనుడు జపవిధానమున జపింపదగిన దానిని తెలిసికొనగలడు ?

7. శ్మశానపు బూడిద మైపూత, గరళము ఆహారము, దిగంబరుడు, జటాధారి, సర్పరాజు హారముగా కలవాడు, కపాలధారి, భూతములకు ప్రభువు, పశుపతి అయిన శివుడు జగదీశ్వర పదవి పొందుచున్నాడు. ఇది, భవానీ ! నీ పాణిగ్రహణ ఫలముగదా !

8. జననీ ! నాకు మోక్షకాంక్ష లేదు, సంసార వాంఛ లేదు, విజ్ఞానాపేక్ష లేదు, సుఖేచ్ఛయులేదు కనుక నా జన్మ, మృడానీ రుద్రాణీ శివ శివ భవానీ-అనుజపముతో గడచునట్లు నిన్ను ప్రార్థించుచున్నాను.

9. అంబా ! వివిధోపచారములతో యథావిధిగా నిన్ను పూజింపలేదు తీక్ష్ణధ్యాన స్తోత్రములను పఠింపలేదు. మాతా ! అనాధుడనగు నాయందు కొంచెము దయచూపుము. అదియే నాకు గొప్పది.

10. దుర్గాదేవీ కరుణార్ణవా ! శివా ! ఆపదలందు మునిగి నీ స్మరణ చేయుచున్నాను. ఇది మోసమని తలంపకుము. ఆకలిదప్పుల బాధ కలవారు తల్లిని స్మరింతురుగదా !

11. జగదంబా ! పరిపూర్ణమగు నీ కరుణ నా యెడకల్గినో ఇందు ఆశ్చర్య మేమికలదు ? ఎన్ని తప్పులున్నను పుత్రు తల్లి విడువడు గదా !

దేవ్యపరాధ స్తోత్రరత్నము సంపూర్ణము.

# శ్రీ రామ జ్ఞానమందిర పబ్లికేషన్ లీగ్
## జ్ఞాన విజ్ఞాన విహార్ (గొరగనమూడి)
### వారి
## తె లు గు  ప్ర చు ర ణ ము లు

1. శ్రీమత్ స్వామి జ్ఞానానంద చరితామృతము
2. జ్ఞానానంద లేఖావళి
3. శ్రీమత్ స్వామి జ్ఞానానంద సద్గురు పూజా కల్పము
4. శ్రీమద్భగవద్గీత (స్వామి ప్రణవానంద. కైలాస మానస సరోవర తీరవాసి)
5. గాయత్రీ మంత్రార్థ వివరణము
   స్వామి ప్రణవానంద
6. శ్రీ జ్ఞానానంద సద్గురు వైభవము
   స్వామి ఆత్మానంద
7. శ్రీ జ్ఞానానంద గేయామృతము
   వేగిరాజు వెంకట రామరాజు
8. శరణాగతి - కళాప్రపూర్ణ
   పెన్మెత్స సత్యనారాయణరాజు, తణుకు,
9. మూడు మూర్తుల దేవర
   చేకూరి చెన్న కృష్ణయ్య
10. శ్రీచక్ర లఘు పూజా విధానము
11. శ్రీచక్ర నవావరణ పూజా విధానము